వ్యాపార మలంకారశాస్త్ర నిర్దిష్టమైనదే. ఇది శబ్దముయొక్క వాచ్యార్థమును బోధించును. ఇది ముగిసిపోగానే భావకత్వ వ్యాపార మారంభమగును. ఇది శబ్దముయొక్క రసాదులను బోధించును. (శృంగారరస సందర్భమున పరుషపద ప్రయోగ మనుచితముకాదనుట యీ వ్యాపారము చేతనే. పరుష శబ్దమునకైనను లలిత శబ్దమునకైనను వాచ్యార్థ మాత్ర బోధకమైన యభిధావ్యాపారము సమానమే.) ఈ వ్యాపారముచే సీతారామాదులగు విభావములు తమ ప్రత్యేకతను గోల్పోయి సామాజికునికి సామాన్యములుగా గోచరించును. అనగా సీతాదులు సాధారణ స్త్రీత్వముతోడను, రామాదులు సాధారణ పురుషత్వముతోడను గోచరింతురు. ఇట్లు విభావములు సాధారణములుగా జేయబడుటకే సాధారణీకరణమని పేరు. దీని వలన సామాజికునకు నాయకాదులతో నభేదత్వ మావహిల్లును. ఇంతటితో భావకత్వ వ్యాపార మవసితమగును. అంత మూడవదియైన భోగకృత్త్వ (భోజకత్వ) వ్యాపారము పనిచేయ మొదలిడును దీనిచే సాధారణీకృతములైన రత్యాది స్థాయి భావములు సామాజికులచే ననుభవింప బడును అప్పుడు వారానందమయమైన యొకానొక స్థితిని బొందుదురు. ఇది సాధారణములైన యనుభవముల కంటెను, స్మృతుల కంటెను విలక్షణమై, పరబ్రహ్మాస్వాదతుల్యమై, స్వసంవేద్యముగా నుండును. ఈ స్థితిలో జిత్తమునకు ధృతి, విస్తారము, వికాసము అను ధర్మము లేర్పడును.

భోగకృత్త్వ వ్యాపారముచే సామాజికులందలి రజస్తమో గుణములడంగి వారి హృదయముల సత్త్వోద్రేక మతిశయించును. అప్పుడు వా రానందమగ్నులై పరిసరములనే కాక తమ్ముగూడ మఱచి వినుచున్న లేక చూచుచున్న వస్తు దృశ్యములతో నేకీభావము నొందుదురు. ఈ మతమున విభావాదులు భోజకములును, రసము భోజ్యము నగుటచే దీనికి భుక్తివాద మనుపేరు గలిగినది.

భట్టనాయకుడు తన మతమున కార్యకారణములకు సామానాధి కరణ్యము లేకపోవుట యను దోషమును బరిహరింప బ్రయత్నించెను. కాని భావకత్వ వ్యాపారముచే విభావములును, రత్యాదులును సాధారణీ కృతములైనను సామాజికులు మొట్టమొదట దమయందు బీజరూపముగా నైన లేనట్టిస్థాయి భావముల ననుభవించుటయు, నాయకాద్యభేదము నొందుటయు నించుక యసంగతములుగా నున్నవి. అదిగాక భట్ట నాయకుడు శబ్దమున కుండునని చెప్పిన యభిధాభిన్నములైన భావకత్వ, భోగకృత్త్వ వ్యాపారములు కేవలము కల్పితములైన వగుటచే బ్రామాణిక సమ్మతముగాకున్నవి. వ్యంజనయే భావకత్వ వ్యాపారము నిర్వహించు చుండ దానికై యొక క్రొత్త వ్యాపారమును గల్పించుట యనవసరము. అభినవగుప్తు డీ వ్యాపారము విభావాదులదే యని చెప్పెను. "తా ఏవ పరిహ్బృత విశేషా రసహేతవః" అని భరత ముని చెప్పిన వాక్యము కూడ నీ షయమునే బోధించుచున్నది. విశ్వనాథుడు విభావాదులకు సాధారణీకృతియను పేరుగల యొక వ్యాపార మున్నదని స్పష్టముగా చెప్పియుండెను. (వ్యాపారో஽స్తి విభావాదే ర్నామ్నా సాధారణీకృతిః).

లోచనకారుడు చెప్పినదానినిబట్టి భట్టనాయకుడు గూడ గావ్యము నకు రసమే యాత్మ యనియు, నది వ్యంగ్యముగా నుండుననియు విశ్వ సించినట్లు తెలియుచున్నది. (సచ కావ్యవ్యాపారైక గోచరో రసధ్వని రితి. సచ ధ్వనిరేవేతి. సఏవ ముఖ్యతయాత్మేతి.) కాని యాతడు రసా స్వాదము వర్ణింప నలవికాదనియు గావ్యమున కాత్మభూతమైనది రస ధ్వని యొక్కటే కాని వస్త్వలంకార ధ్వనులు కావనియు నభిప్రాయ పడియుండెను. ధ్వని మతమునకును నాతని మతమునకును గల భేద మింతే.

భట్టనాయకుడు రసము సామాజిక నిష్ఠమనియే చెప్పెను. కాని దానికి బీజములు స్వల్పముగానైన సామాజికులందుండునని యంగీక రింపలేదు. అభినవగుప్తుని మతమున రస మభివ్యక్తము. సహృదయుల

హృదయములందు రీత్యాదులు వాసనారూపమున నడగియుండుననియు, నవి విభావానుభావాదులచే సముల్లాసితములై రసములుగా బరిణమించు ననియు నాతని వాదము. ఈతని మతమున నీ వాసన లేనిచో రసాస్వాదము గలుగదు. అందుచేతనే వైయాకరణులకును మీమాంసకులకును రసాస్వాదము గలుగదని ధ్వనికారుడు చెప్పియుండెను. వాసనా రహితులైన సామాజికులకు రసాస్వాదము మృగ్యమనియు, నట్టివారు రంగాంతఃస్థితకాష్ఠకుడ్యాశ్మసన్నిభులనియు ధర్మదత్తుడు వివరించియుండెను. వ్యంజనాశక్తి ప్రభావముచే రస మభివ్యక్తమగుననియు, రసాస్వాదనమును వివరించి వర్ణింపవచ్చుననియు నభినవగుప్తుడు నుడివియుండెను.

"సవాసనానాం సభ్యానాం రసస్యాస్వాదనం భవేత్
నిర్వాసనాస్తు రంగాంతః కాష్ఠ కుడ్యాశ్మ సన్నిభాః"

అతడు భట్టనాయకుని భావకత్వ వ్యాపారమును బూర్తిగా నుజ్జగించెను. రసభోగమని చెప్పక యాతడు రసప్రతీతి యనియు రసచర్వణమనియు నుడువుచుండును. ఈతని వాదము ననుసరించి వాసనారూపముననున్న స్థాయిభావములనే విభావాదులు వ్యక్తము చేయుననియు, నావ్యక్తములైన స్థాయిభావములే రసములనియు స్పష్టమగుచున్నది. అందుచేతనే దీనికభివ్యక్తివాద మను పేరు వచ్చినది. అభివ్యక్తి యనగా నున్నదానిని వ్యక్తముచేయుట భట్టనాయకుని మతమున నీ వాసనాప్రసక్తియేలేదు. భుక్త్యభివ్యక్తివాదములందలి ముఖ్యభేదములలో నిదియొకటి.

అభినవగుప్తుని మతమున భరత సూత్రమునందలి సంయోగ పదమునకు వ్యంగ్యవ్యంజక భావమర్థము. నిష్పత్తి యనగా నభివ్యక్తి రత్యాదులగు స్థాయిభావములు వ్యంజకములగు విభావానుభావాది భావములచే వ్యంగ్యములై రసములగును.

భరతుడు ముఖ్యముగా దృశ్య కావ్యములను మనమున నుంచుకొని రససూత్రమును వివరించెను. లోల్లటాదులును నా దృష్టితోనే దానికి వ్యాఖ్యానము కావించిరి. ధ్వనికారుడైన యానందవర్ధనుడు రససిద్ధాంత

మును శ్రవ్యకావ్యముల విషయమునగూడ సమన్వయించెను. దృశ్య కావ్యములందు నటుల మూలమున విభావాదులు ప్రత్యక్షమగుచుండును. కావున సామాజికులు నాయకాభేదమును బొంది యానందము ననుభవింతురు. శ్రవ్యకావ్యములలో నాయకాదులు ప్రత్యక్షము కారు. కావున సామాజిక స్థానీయులైన పాఠకులు నాయకాభేదమునొంది రసానందము నెట్లనుభవింతురని సందేహము కలుగవచ్చును. వాక్యపదీయకారుడైన భర్తృహరి "పాఠకులు శబ్దోపహితరూపములు గల్గి బుద్ధి విషయత్వము నొందిన కంసాదులను ప్రత్యక్షములయిన వారినివలె సాధనములుగా గ్రహింతు"రని తెల్పి యాసందేహమును నివారించినాడు.

"శబ్దోపహితరూపాం స్తాన్ బుద్ధే ర్విషయతాంగతాన్
ప్రత్యక్షానివ కంసాదీన్ సాధనత్వేన మన్యతే"

అనగా శ్రవ్యకావ్యములందు గవులు వాడు శబ్దములచేతను, శయ్య వర్ణనాదులచేతను నాయకాదుల రూపమును బొంది, పాఠక హృదయములు చొచ్చి ప్రత్యక్షముగా గోచరింతురు. వారు రంగమున చర్మచక్షువులచే జూచు నాయకాదులనే శ్రవ్యకావ్యముల విను సందర్భమున హృదయరంగమున మనోనేత్రములచే దిలకించి తదభేదము నొంది రసానందము ననుభవింతురు.

ఆత్మ యానందమయమైనట్టిది. దాని నావరించియుండు నజ్ఞానము తొలగగనే యా యానందము స్వస్వరూపముతో విలసిల్లును. కావ్య పరనావసరములందు విభావాదులచే నీ యజ్ఞానావరణము తొలగింపబడుచుండును. అప్పుడు తన్ను బరివేష్టించియుండు రత్యాదివాసనలతో గూడి యాత్మానందము ప్రకాశించును. తదానంద సంవలితమైన రత్యాదులకే రసములని పేరు. రసానందము విచిత్రమైనది తదనుభవము సహృదయ హృదయైకవేద్యమైనట్టిది.

లోకమున శోక కారణములైన పరిస్థితులవలన శోకమే కలుగుచుండగా కావ్యము లందలి యానందము నెట్లుత్పాదింప జాలునను శంక

కలుగవచ్చును. లోకగత నాయకాదులకును గావ్యస్థిత నాయకాదులకును లౌకికాలౌకికత్వ భేదమే యీ వ్యత్యాసమునకు గారణము కావ్యశిల్ప మలౌకిక మయినది. అట్లే కావ్య గత నాయకాదులును లౌకిక నాయకాదులు గాక తదనుకర్త లగుటచే నలౌకికులే యగుచున్నారు. లోకమున శోక హర్షాదులకు గారణములైనవి కావ్యమున గారణ శబ్ద వాచ్యతను వీడి విభావ శబ్దవాచ్యత నొందుచున్నవి. కావ్య గతములైన యీ విభావము లన్నింటివలనను పాఠక సామాజికుల కానందమే యావహిల్లుచుండును. సామాన్య సమయముల వేదనాకరము లగు నఖదంతక్షతాదులు సురతవేళా దత్తములైనచో సుఖసంధాయకము లగుచుండుట యనుభవసిద్ధ విషయమే కదా ! : "తేభ్య స్సురతే దంతఘాతాదిభ్య ఇవ సుఖమేవ జాయతే".

కరుణాది రసము లానందప్రదము లెట్లగునని యాశంకించి సాహిత్యదర్పణకారుడు పై విషయమునే యిట్లు చెప్పియున్నాడు

> " హేతుత్వం శోకహర్షాదేః నటేభ్యో లోక సంశ్రయాత్
> శోకహర్షాదయో లోకే జాయన్తాం నామ లౌకికాః
> అలౌకిక విభావత్వం ప్రాప్తేభ్యః కావ్య సంశ్రయాత్
> సుఖం సంజాయతే తేభ్యః సర్వేభ్యోఽపీతి కాక్షతిః "

లోకమున శోక హర్షాదులకు హేతువులైనవారివలన లౌకికము లైన శోక హర్షములే గలుగుననియు గావ్య సంశ్రయముచే నలౌకిక విభావత్వమును బొందిన వాని యన్నింటివలనను సుఖమే సంజాతమగు ననుటలో విప్రతిపత్తి లేదనియు నాతని భావము. అట్లుగాక, కరుణాది రసములు దుఃఖ హేతువులే యైనచో దత్ప్రధానములైన కావ్యములయెడ నెవ్వరున్ముఖు లగుదురని యాతని ప్రశ్న. (కించదేష యదా దుఃఖం నకోపిస్యా త్తదున్ముఖః) రామాయణాది కావ్యములు కరుణరస ప్రధానములయ్యు బెక్కుసారులు పాఠక జనుల నాకర్షించుచుండుట కవి యానందప్రదము లగుటయే కారణమని వేఱ చెప్ప నక్కఱలేదుగదా !

హరిశ్చంద్ర నాటకము, రామాయణ నాటకము మున్నగు నాటకములను దర్శించునప్పు డందలి కరుణరస నిర్భరములైన ఘట్టములగాంచి సామాజికులలో గొందఱు కంట దడిపెట్టుట మనము కాంచుచుందుము నాటకప్రయోగ మే రసముతో గూడినదైనను ఆనందప్రదమే యగుచుండగా వారట్లు కన్నీరు కార్చుటకు హేతువేమి? ఆ యశ్రువులు హృదయమునకు సహజమైన దయా సానుభూతులచే గలుగునట్టివేకాని దుఃఖ బాష్పములుకావు. "అశ్రుపాతాదయ స్తద్వ ద్దుృతత్వా చ్చేతసో మతాః" అని సాహిత్య దర్పణము నుడువుచున్నది. అనగా నట్టి సమయముల వారి హృదయము ద్రవించి కనులవెంట నీరై వచ్చును. ఆ కన్నీరు ఆనంద సూచకమైనట్టిదేకాని దుఃఖ సూచకముకాదు.

పాశ్చాత్యులు మోదాంత నాటకములకన్న విషాదాంత నాటకములనే యుదాత్తతరములుగా బరిగణింతురు దానికి దజ్జన్యమగు నానందము విశిష్టమై యుండుటయే కారణమని చెప్పవలెను. గ్రీకు తత్త్వవేత్తలలో నగ్రగణ్యుడును, పాశ్చాత్య లాక్షణికుల కాచార్య ప్రాయుడు నగు నరిస్టాటిలు లలితకళలన్నియు ననుకరణాత్మకములని యభిప్రాయపడి యుండెను. లలిత కళల ననుభవించువారు దత్కళా జనితానందమును సమగ్రముగా బొందవలె ననిన నవి యనుకరణములను సంగతి విస్మరింపరాదు. అవిగాక యవి యథార్థములేయని భావించుచో వారికానందమునకు బదులు భయ జుగుప్సా కోపాదులగు నితరభావము లుప్పతిల్లును. అనుభవమునుబట్టి చూచిన నీ విషయము తేటతెల్లమగును. ఇరువురు యోధులు నిశిత కరవాలములదాల్చి యొండొరుల జంప నుంకించుచు యుద్ధ మొనరించు దృశ్యమును జూచునప్పుడు మనకు భయకంపాదులే కాని యానందము గలుగదు. అట్టి దృశ్యమును జూడలేక భయాక్రాంతులమై మనము దవ్వుగా బోనెంతుము. అట్లుగాక ప్రతిభాశాలియైన మహాకవి యిరువురు యోధులు కావించు పోరాటమును సవిస్తరముగా వర్ణించుచు బద్యములు వ్రాసినచో నా పద్యములను జదువునప్పుడు మనమానం

దము నొందుటేగాక వానిని మాటిమాటికి జదువ నిచ్ఛగింతుము. ప్రకృతిలో దుఃఖమును గలిగించు నభిమన్యు వధాది ఘట్టములను మనము పునఃపునః చదువ నువ్విళ్ళూరుటకును, బంది, గాడిద మున్నగు ననహ్యములగు జంతువుల చిత్రములవైన బదింపదిగా నవలోకింప దివ్వురుటకును నిదియే కారణము. దీనినే పండితరాయలు "అయంహి లోకోత్తరస్య కావ్యవ్యాపారస్యమహిమా యత్ప్రయోజ్యా అరమణీయాశ్శోకాదయః పదార్థా ఆహ్లాద మలౌకికం జనయన్తి విలక్షణోహి కమనీయః కావ్యవ్యాపారజ ఆస్వాదః" అని రసగంగాధరమున నుడివియుండెను. ఈ విషయ మొక్క కావ్యముననేగాక యితర లలితకళలకును నన్వయించును. ప్రకృతిలో భయచింతా జుగుప్సాదులను గలిగించు దృశ్యములే కళారూపము లొందినప్పుడు మన కానందజనకము లగుటకు అవి యనుకరణములే కాని యథార్థములు కావని మనభావముల జ్ఞానము స్థిరముగానుండు కారణము. మనము దారిని బోవునప్పు డొక కుక్క మొఱిగినచో భయపడి పారిపోవుదుము. హాస్యకారుడు కుక్కకూత ననుకరించుచో మనమచ్చెరువడి నిల్చి యానందింతుము. హాస్యకారుడు మనకు గనబడకుండ మఱుగున నుండుచో మన మా కూతనే విని యది నిజమైన కుక్క కూతయే యని యెంచి దానిని గూర్చి యిసుమంతయైన నాలోచింపక మనదారిని బోవుదుము. అందుచే గళలవలన బుట్టు నానందము ననుభవించుటకు అవి యనుకరణములను జ్ఞానము తప్పక యుండవలయును. ఈ యనుకరణ జ్ఞానమే యానందజనక మని (Imitation is the largest pleasure) అను నాంగ్లేయ వాక్యము సూచించుచున్నది. కావ్యగతనాయకాదు లనుకర్తలేగాని యథార్థరూపులు గాకపోవుటచే కావ్యరస మేదియైనను అది పాఠకజనుల కానందసంధాయక మగుట సంభవించుచున్నది. దీనివలన శృంగారాదు లెట్లో కరుణాదులుగూడ నట్లే యానంద జనకములని నిర్ణయింపవచ్చును.

బ్రహ్మానంద సబ్రహ్మచారియైన రసానంద స్వరూపము వివరించి చెప్పుటకు నిజమునకు నాకు శక్తి చాలదు. సుధీవతంసులగు లాక్షణి కాగ్రణుల మార్గము ననుసరించి యట్లు చేయుటకు గొంత యత్నించి తిని. రసానందానుభవము బ్రహ్మానంద సంపాదనమునకు బ్రోత్సాహ మును కల్పించును. ఆ ప్రోత్సాహమును బ్రహ్మసృష్టిలో జ్ఞానాధిక్యముచే విశిష్టమై యొప్పు మానవ సమూహము వ్యర్థము చేయరాదు. ఈ విష యము గ్రహించి కొందఱైన బ్రహ్మానంద సామ్రాజ్య సంపాదనమునకు దీక్షితులైనచో గావ్యము ధర్మార్థకామములనే గాక మోక్షమునుగూడ నొసంగజాలుటయు రససిద్ధులైన కవీంద్రుల మహాకావ్యకరణ క్లేశ ముదాత్త ఫలదాయక మగుటయు సంభవించును.

★

## రెడ్డి ప్రభువుల వాఙ్మయ పోషణము

**శ్రీ కేతవరపు వేంకట రామకోటి శాస్త్రి**

సుమారు క్రీ. శ. 1250 - 1320 మధ్యకాలమున కాకతీయుల సామంతులుగా, నిజాంరాష్ట్రమున వర్ధమానపురము, రాయచూరు ప్రాంతములు రెడ్డి వంశజులు పాలించిరి. వారిది గోనవంశము. ఆ వంశము లోని బుద్ధభూపతి, కాచభూపతి, విఠలవిభుడు అనువారు ద్విపదచ్ఛందమున రామాయణమును రచించిరి. బాలకాండమునుండి యుద్ధకాండము వరకు బుద్ధారెడ్డియు, ఉత్తరకాండమును అతని పుత్రులమని చెప్పుకొనుచు కాచ విఠలభూపతులును రచించిరి. దానికే రంగనాథరామాయణమని పేరు. ఇటీవల ఆంధ్రవాఙ్మయరంగమున పరిశోధనమారంభమై తత్ఫలితముగా రంగనాథరామాయణకర్తలు రెడ్లుకారనియు, రంగనాథుడను కవి రామాయణమును రచించి తనను పోషించు రాజులపేర వెలయించెననియు తేలినది. రెడ్లకర్తృత్వమును విశ్వసించువారును కొందరు గలరు. నాకుజూడ రంగనాథుని గర్తృత్వమును స్థాపించువారు చూపిన హేతువులే బలవత్తరములుగా నున్నవి. పూర్వోత్తరరామాయణముల యందలి రచనావిధానమును ఏకకవి కర్తృత్వమునే స్థాపించుచున్నది. రంగనాథు డీరామాయణకర్త యగుట మూలమున ఆరెడ్డి వంశజులకు వచ్చుహాని యేమియు లేదు. అంతటి మహాకవిని పోషించిన గౌరవము ఆ గోనవంశపు రెడ్లకుండనేయుండును. కాక, వారే రామాయణకర్తలన్నచో ఒక ఉద్గ్రంథ కర్తృత్వగౌరవము వారికి దక్కుచున్నది. రాజవంశమువారు వాఙ్మయస్రష్ట లగుటలోనే అందమున్నది. గోనవంశపు రెడ్లు అట్టివా రగుటవలన వారికి వచ్చు గౌరవహానియు లేదు.

రంగనాథ రామాయణము ద్విపదచ్ఛందమున వ్రాయబడినది. ఒక గ్రంథము నంతయు ఒకే ఛందమున వ్రాయుట ఆంగ్లమున నున్నది. సంస్కృతముననను నున్నది. వాని విషయమున నే నేమియు ప్రస్తుతము చెప్పజాలను. తెనుగున మాత్రము ఒకే ఛందమున వ్రాయబడిన గ్రంథమునందు కావ్యగౌరవము అధికముగా ప్రదర్శింపబడుట కవకాశ ముండునని నా విశ్వాసము. వృత్తౌచిత్యమున నాకు గౌరవ మధికము. ద్విపద గ్రంథము లన్నియు నొకే ఛందమున వ్రాయబడినవే. అట్టి ద్విపదలో గ్రంథరచన చేసిన సుమారు 40 మంది రచయితలను, సుమారు 50 వరకు వారి గ్రంథములను నే నెరుగుదును. నే నెరిగిన గ్రంథములలో 25 కు పైగా ముద్రింపబడినవి. అందు 15 కు పైగా నేను జాగ్రత్తగా పరిశీలించితిని. ఈ ద్విపద-గ్రంథ రచయిత లందఱును కవితావేశమునకంటె మతావేశ మధికముగా గలవారు. ఆ రెండింటికిని భేదమున్నది. కవితావేశమువలన కవిత్వము వ్రాయవచ్చునుగాని, మతావేశమువలన ఆ పని కాదు. ఈ మతావేశము రెండు విధములు. శైవ మొకటి వైష్ణవ మొకటి. ఇరువురును స్వమతప్రచారమునకు గ్రంథములు వ్రాసిరి. ద్విపద చ్ఛందముననే వ్రాసిరి. మతావేశము శైవులలో కంటె వైష్ణవులలో తక్కువ. కవితావేశముండి మతావేశము తక్కువగుట వలన వైష్ణవుల ద్విపద గ్రంథములు శైవులవానికంటె కావ్యగౌరవము గలిగియున్నవి. రంగనాథ మట్టి వైష్ణవ మతానుయాయుల గ్రంథ మగుట వలన కావ్యగౌరవ మందుచున్నది. కథాకథనమందును, సన్నివేశ కల్పనము నందును, పాత్రోన్మీలనము నందును, ఉక్తిచమత్కృతి యందును కావ్యత్వము నిముడ్చుకొనిన గ్రంథము రంగనాథ రామాయణము.

## 2

ఓరుగంటి ప్రతాపరుద్ర రాజన్యుడు మహమ్మదీయులచేత ఓడింపబడి ఢిల్లీనగరమునకు తీసికొని పోబడిన తరువాత, ఆ ప్రభునికడ దండ

నాథులుగా నున్న రెడ్లు, వెలమలు స్వతంత్రులై ఆంధ్రదేశమున కొంత కొంత భాగము నాక్రమించుకొని పాలింప దొడగిరి. అట్టి రెడ్లలో కోమటి ప్రోలయరెడ్డి రెండవ కుమారుడు వేమారెడ్డి ముఖ్యుడు. 1320వ ప్రాంతమున స్వతంత్రుడై 1349 వ సంవత్సరము వఱకును అద్దంకి రాజధానిగా ఆ పరిసర ప్రాంతమును పాలించుచు బలహీనులైనవారిని జయించుచు తన రాజ్యమును విస్తీర్ణము గావించెను. తా నద్దంకియం దుండి తాను జయించిన భాగములకు తన బంధువుల నధికారులుగా నియమించెను. ఈ వేమారెడ్డి తమ్ముడు మల్లారెడ్డి యనునాతడు సముద్ర తీరస్థ పట్టణములమీద నధికారము నెఱపుచు వ్యాపారము నభివృద్ధి చేయుచుండెను. ఈ మల్లారెడ్డి ఆ యా గ్రామములలో తిరుగుచున్న ప్పుడు గుడ్లూర ఎఱ్ఱాప్రగ్గడ యను కవిపండితుడు కనిపించెను. అతనిని తన యాస్థానములో నుంచుకొని పోషించిన బాగుండునని తలచి అతనిని గొనివచ్చి తన యన్నగారైన వేమారెడ్డికి చూపి చెప్పెను. నాటినుండియు ఎఱ్ఱాప్రెగ్గడ, వేమారెడ్డి యాస్థాన కవి. వేమారెడ్డి బ్రాహ్మణ భక్తి గలవాడు, విద్వత్తును గౌరవించు నేర్పాతని కున్నది అతని పెద్దకుమారుడైన అనపోతారెడ్డి సేనానాయకుడు. వీరందఱును పంటరెడ్లు ఈ విషయములన్నియు ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన హరివంశ కృత్యాదిలో నున్నవి. ఈ కవి రామాయణమును, హరివంశమును వేమారెడ్డి యాస్థానమున నున్న కాలమున రచించెను. ఆ రెండును వేమారెడ్డికే అంకితము చేయబడినవి రామాయణము నేడుపలభ్యము కాదు రెడ్డిరాజుల ప్రాపుపోయిన తరువాత భారతారణ్య పర్వశేషమును, నృసింహ పురాణమును ఈ కవి రచించెను. భారతారణ్య పర్వశేష పూరణమువలన కవిత్రయములోని కెక్కి ప్రబంధ పరమేశ్వరుడైన ఎఱ్ఱాప్రెగ్గడ నాస్థాన పండితకవిగా నుంచుకొని పోషించిన రెడ్డిరాజుల వంశమును, వేమారెడ్డియు చిరస్మరణీయులు. ఆంధ్ర కవితా స్రవంతిని ఐతిహాసిక తీర్థమునుండి పురాణ కావ్య ప్రబంధ తీర్థములవైపు మళ్ళిం

చిన మొదటి మహాకవి ఎఱ్ఱన రెడ్డి రాజుల ఆదరాభిమానముల వల్లనే నిలువబడ గలిగినాడు. కథాకథన విషయమున నన్నయను, అర్థగాంభీర్యాది శిల్ప సంపాదనమున తిక్కనను, ఆదర్శముగా నుంచుకొని, యౌచితినిబట్టి వర్ణనాంశములను జేర్చుచు కావ్యరచన చేసిన గౌరవము ఎఱ్ఱనకు దక్కినది. ఆతనిని ఆదరించిన గౌరవము రెడ్డిరాజులకు దక్కినది. ఎఱ్ఱాప్రెగ్గడ, పైన నే నుదాహరించిన గ్రంథములే గాక నీలకంఠేశ్వర శతకము నొకదానిని గూడ రచించిన ట్లూహించుట కవకాశ మున్నది.

ఎఱ్ఱాప్రెగ్గడతో పాటు సంస్కృత పండితులును వేమారెడ్డి యాస్థానమున నున్నారు. లొల్ల మహావుడనువా డందు ముఖ్యుడు. ఈతని వంశజులును రెడ్ల యాస్థానమున నున్నవారేయని శ్రీ వేటూరివారి యభిప్రాయము. వీరందఱును సంగీత సాహిత్యములందు ఘటికులు వేమారెడ్డి సంగీత సాహిత్యములను సమముగా ఆదరించి పోషించినట్లు ఎఱ్ఱనయే చెప్పుచున్నాడు. వేమారెడ్డి విద్యా తపోవృద్ధులైన విప్రుల కగ్రహారములిచ్చి వారిచేత యజ్ఞములు చేయించెననియు, చెఱువులు త్రవ్వించి, గుళ్ళు ప్రతిష్ఠించి, సత్రములు పెట్టించి తోటలు వేయించి సద్ధర్మ తాత్పర్య బుద్ధియై, నీతినిధియై, జాహ్నవీ ప్రవాహమువలె భువన పావనమైన చరిత్రతో ధరణిని పాలించెనని ఎఱ్ఱన తన హరివంశమున చెప్పియున్నాడు.

వేమారెడ్డి తరువాత అతని పెద్ద కుమారుడు అనపోతారెడ్డి రాజయ్యెను. తండ్రి యుండగా నితడు సేనానాయకుడు. అప్పటినుండియు ఇతడు కొండవీట స్థిరనివాస మేర్పఱచుకొని యుండెను. తండ్రి యనంతరము కొండవీడు రాజధానిగా రాజ్యపాలన కుపక్రమించెను (1350-1360). ఇతడును కవి పండిత పోషకుడై వెన్నెలకంటి వంశజుడైన ఒక కవి రచించిన గ్రంథములకు కృతిపతియైనట్లు 1500-1550 మధ్యనున్న వెన్నెలకంటి సూరన తన విష్ణు పురాణమున వ్రాసినాడు.

వేమారెడ్డి వలన అగ్రహారములు పొందిన వెన్నెలకంటి సూర్యుడను కవీంద్ర కుంజరుడున్నట్లు జక్కన (1340-1395) తన విక్రమార్క చరిత్ర షష్ఠ్యంతములలో వ్రాసియున్నాడు. అది ప్రక్షిప్తమని కొందరి యూహ అయినను వేమారెడ్డిచేత సత్కరింపబడిన వెన్నెలకంటి కవి యొకడున్నాడని తెలుచున్నది. తండ్రి యుండగనే అనపోతారెడ్డి సైన్యాధ్యక్షుడుగా నున్నాడుగదా! తండ్రి యనంతరము రాజైన తరువాత ఆ వెన్నెలకంటి కవి కొన్ని గ్రంథములు రచించి అనపోతారెడ్డికి అంకితమిచ్చి యుండవచ్చును. అవి కాలగర్భమున గలిసిపోయినట్లుగనే భావింపబడుచున్నవి. గ్రంధములు కనిపించకపోయినను కవిపోషకుడు, కృతిపతి అను గౌరవప్రతిష్ఠలు మాత్రము అనపోతారెడ్డికి దక్కి నిలిచి యున్నవి. వెన్నెలకంటి సూరన్న ఆ గ్రంధముల పేర్లయినను చెప్పక పోవుట విచారకరము. ఇతని యాస్థాన విద్యాధికారి బాలసరస్వతి.

అనపోతారెడ్డి తరువాత అతని అనుజుడు అనవేమారెడ్డి (1361-70) కొండవీటి ప్రభువయ్యెను. ఇతని యాస్థానమున ప్రకాశభారతీయోగి యను నుభయభాషా కవిత్వ విశారదు డుండెను. ఇతనికి ధర్మవేమన యని పేరు. ఇతని యాస్థాన విద్యాధికారిగా కొంతకాలము బాలసరస్వతియు, తరువాత త్రిలోచనాచార్యుడును ఉండిరి

ఇతడు సంస్కృతాంధ్రముల ననేక కావ్యములు రచించెనట. అవి యింకను ఉపలభ్యములు గాలేదు. ద్రాక్షారామ భీమేశ్వరాలయ శిలా శాసనములలో ఇతడు రచించిన రెండు సీసపద్యములు మాత్ర మున్నవి. ఆ పద్యముల రచనా విధానమును బట్టి ఇత డుత్తమకవి యగుటకు శక్తుడని యూహింపవచ్చును. అనవేమారెడ్డి కవిపండిత పోషకుడైనట్లు సంస్కృతాంధ్రముల నున్న చాటువులు చెప్పుచున్నవి. ఇతడుగూడ కృతిపతియైనట్లు వెన్నెలకంటి సూరన విష్ణుపురాణమున చెప్పి యున్నాడు. అవి ఏకవి రచించిన గ్రంథములో మాత్రము చెప్పలేదు. ఇవి యును నేడు ఉపలభ్యములు గావు. తండ్రివలెనే అనపోత, అనవేమా

4

రెడ్లు ఇరువురును కవిపోషకు లైనట్లును, కృతిపతు లైనట్లును తెలియు చున్నది.

అనవేముని యనంతరము అనపోతారెడ్డి కుమారుడయిన కొమరగిరిరెడ్డి ( 1371 - 1400 ) కొండవీటి సింహాసన మధిష్ఠించెను. ఇతని బావమఱదియైన కాటయ వేమారెడ్డియే ఇతనికి మంత్రి. కొమరగిరిరెడ్డియు, కాటయ వేమారెడ్డియు సంస్కృతమున నుద్దండ పండితులు. కొమరగిరి వసంతరాజీయ మను నాట్యశాస్త్రమును రచించెనని కాటయ వేమారెడ్డి శాకుంతల వ్యాఖ్యలో చెప్పెను. అది ప్రస్తుత ముపలభ్యము కాదు. కాటయ వేముడు కాళిదాస కృత నాటక త్రయమునకు వ్యాఖ్య రచించెను. అది ప్రామాణిక వ్యాఖ్యగా ప్రాక్పశ్చిమ సంస్కృత పండితులు అంగీకరించుచున్నారు. కొమరగిరిరెడ్డి భోగైక పరాయణుడు, ప్రతి సంవత్సరమును వసంతోత్సవములు చేయువాడు. ఈ యుత్సవములకు సుగంధద్రవ్యము లొసగు అవచి తిప్పయ హర విలాస కృతి భర్త. కాటయ వేము డెంతటి పండితుడో అంతటి వీరుడు. తూర్పుదేశమును జయించి రెడ్డిరాజ్యమును అభివృద్ధిచేసెను. రాజ మహేంద్రవరము నాక్రమించి అచట తనకు ప్రతినిధిగా తన బావమరిది అల్లాడరెడ్డి నుంచెను. ఈ బావమరదు లిరువురును కృతిపతులు గాక పోయినను కృతికర్తలై చిరకీర్తి నార్జించుకొనిరి.

## 3

ద్రాక్షారామములోని యొక శిథిల శిలాశాసనమున కుమారగిరిరెడ్డికి అనపోతారెడ్డి యను కుమారు డున్నట్లున్నది. కాని, అతడు తండ్రికంటె ముందే మరణించి యుండుటవలన కాబోలును పెదకోమటి వేమారెడ్డి రాజయ్యెను. ఇతడు రెడ్డిరాజ్య స్థాపకుడైన ప్రోలయ వేమన కన్నయైన మాచారెడ్డికి మనుమడు. కొమరగిరిరెడ్డికి దగ్గఱ జ్ఞాతి, అందువలన

రాజయ్యెను. ఇతనికి వీరనారాయణు డనియు, సర్వజ్ఞ చక్రవర్తి యనియు బిరుదనామములు గలవు. ఇతడు 1400-1420 వరకు రాజ్యము చేసెను. రెడ్డి రాజన్యుల పరిపాలనా కాలమున నీ యిరువది సంవత్సరములును స్వర్ణయుగము. ఇతడు స్వయముగ పండితుడు. ఇతని యాస్థానమున నీ యిరువదియేండ్లును శ్రీనాథుడు విద్యాధికారిగా నుండెను. ఇతని యాస్థానమున వామనభట్టబాణు డను ఉద్దండ పండితకవి యుండెను. వీరిరువురునుగాక పెదకోమటి వేమభూపాలునిచే పోషింపబడిన విద్వాంసు లనేకులు గలరు. అందు (1) పెద్ది యజ్వ. ఇతడు బ్రహ్మసూర్యాది సిద్ధాంతవేత్త, యజ్ఞము చేసినవాడు. ఇతనికి కోమటివేముడు కల్వపాముల అను గ్రామమును దానము చేసెను. గుడివాడ తాలూకాలోని కలువ పాముల అదే కావచ్చును. (2) భాస్కరార్యుడు మహాపండితుడు. భూలోకధన్వంతరి యను బిరుదు మోసినవాడు. వేము డితనికి పొన్ను పల్లి యను గ్రామమిచ్చెను. (3) గురుశంకరమౌని. ఇతడు నైషధ కృతిపతియైన మామిడిసింగనకు గురువు. శైవాచారవేత్త. పినపాడు అను గ్రామమును వేమునినుండి ఇతడు గ్రహించెను (4) విశ్వేశ్వరపండి తుడు, ఇత డలంకారశాస్త్ర పారంగతుడు. చమత్కార మంజరి యను అలంకారశాస్త్ర గ్రంథకర్త ఆలపాడును వేము డీతనికి దానము చేసెను. (5) రామచంద్రసిద్ధాంతి. జ్యోతిష పండితుడు. పెద్ది యజ్వ పుత్రుడు. వేమారెడ్డి రుద్రవర గ్రామ మితనికి దానము చేసెను. (8) పిశిపాటి రామభద్ర సోమయాజి. ఇతడు వేదవేత్త. పొట్లపాడు గ్రామమీతని కీయ బడినది. వీరు ముఖ్యులు. వీరుగాక సింగనార్యుడు, ఎల్లెపెద్ది లక్ష్మణ దీక్షితులు. షడ్దర్శనాల వల్లభసోమయాజి మొదలయినవారు గలరు. పెదకోమటి వేమభూపాలుని శాసనములు పదుమూడు మాత్రమే యిప్పటికి లభించినవి. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు వానినన్నిటిని ప్రచురించిరి. ఆ శాసనముల మూలముననే వేమారెడ్డిచేత పోషింపబడిన యాపండితుల నామములు మన కెఱుకపడినవి. ఇంకను కొన్ని శాసనములుండి

యుండునని పరిశోధకుల యూహ. అవి బయలుపడినచో ఆభూపాలునిచే పోషింపబడిన విద్వాంసు లింకను చాలమంది మనకు తెలియుదురు. పెదకోమటి వేమారెడ్డి వర్ణనమునకు ప్రతిదినమును చిల్లరకవులు వందల సంఖ్యలో వచ్చుచుండెడివారు. ఈ విషయము శ్రీనాథుని

"బూడిదబుంగలై యొడలు పోడిమి దక్కి మొగంబు తెల్లనై
వాడలవాడలందిరిగి వారును వీరును జొచ్చొచోయనన్
గోడల గొందులందొదిగి కూయుచునుండెదు కొండవీటిలో
గాడిద! నీవునుం గవివి కావుగదా, యనుమానమయ్యెడిన్"

అను చాటువునుండి యూహింపబడినది. కొండవీటిలో గాడిదలధికమట. కవులును అట్లే. సన్మానార్హత లేనివారును తాము వ్రాసినది కవిత్వమను నమ్మకముతో ఆ వీటనేయుండి నిరంతరమును స్వీయ కావ్యగానము చేయుచుండెడివారు కాబోలును. గాడిదలును అట్లే అందరిచేతను అదలింపబడి గొందులలో నొదిగి కూయుచుండెడివి. ఆ కవుల తాపత్ర యము, ప్రయత్నము చూచి శ్రీనాథుడు హాస్యమున కాపద్యము చెప్పి యుండును. శ్రీనాథుడు గాక మరొకడు చెప్పినను నాటికాలపు కవుల యుమ్మరము ఆ పద్యమువలన వ్యక్తమగుచునే యున్నది.

ఇంతమంది పండితులను పోషించి రాచరికము నెరపిన, సంస్కృత ప్రాకృతాంధ్రములందు అనన్య సామాన్య ప్రతిభగల పెద కోమటి వేమభూపాలుని యాస్థానము నలంకరించిన ఇరువురు పండిత కవులును బహుగ్రంథకర్తలు. వామనభట్ట బాణుడనువాడు (1) వేమ భూపాలచరితము, (2) నలాభ్యుదయము, (3) రఘునాథాభ్యుదయము అను కావ్యములును, శబ్ద రత్నాకరము, శబ్ద చంద్రిక యను నిఘంటువు లును, పార్వతీ పరిణయము, శృంగారభూషణము అను రూపకములును, హంస సందేశమను ఖండకావ్యమును రచించినాడట. వేమభూపాల చరితమనునది ఆఖ్యాయిక. సాహిత్య చూడామణి యనియు, గద్యకవి

సార్వభౌముడనియు ఇతని బిరుదములు. ఇంతటి విద్వాంసునిముందు విద్యాధికారి పదవిలో నున్నవాడు శ్రీనాథుడు. ఇతడు కొండవీడు చేరు నప్పటికే మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి రచియించెను. పండితారాధ్య చరిత్ర రచించుచు కొండవీడు చేరి మామిడి ప్రెగడన మంత్రికి కృతియిచ్చెను ఇది 1400 ప్రాంతమున జరిగినది. అతడు పెద కోమటి వేమభూపాలుని యాస్థాన విద్యాధికారి పదవి స్వీకరించినాడు. అందుకు ప్రెగడమంత్రి తమ్ముడైన సింగమంత్రి సహాయమును గూడ పొందియుండవచ్చును. ఆ సింగమంత్రి పెదకోమటి భూజానికి మంత్రి 1405-1410 సంవత్సరముల మధ్యకాలమున హర్షనైషధము నాంధ్రీక రించి ఆ మంత్రి శేఖరున కంకితమిచ్చియుండును. శ్రీనాథుడు పెద కోమటి వేముని యాస్థానముననున్న ఇరువది సంవత్సరములలోను ఒక్క నైషధమును మాత్రమే వ్రాసెను. తరువాత, గ్రంథరచనకు తగిన తీరిక యుండియుండదు. అతడు విద్యాధికారిగదా:

పెదకోమటి వేమారెడ్డియు బహు గ్రంథకర్త. (1) అమరుక కవికృత అమరుక మను శృంగార శతకమునకు 'శృంగార దీపిక' యను వ్యాఖ్య. అమరుకమునకు మఱికొన్ని వ్యాఖ్య లున్నవనియు. అయినను దీనికే ప్రచారము మెండనియు, ఇది విపులమయిన చక్కని వ్యాఖ్య యనియు శ్రీ వేటూరి వారి యభిప్రాయము. (2) హాలుని సప్త శతిలో మండి నూఱు గాథల నేఱి వానికి 'సప్తశతీకార టీక' వ్రాసెను. (3) ధ్వన్యాలోకాదులను పరామర్శించుచు మహిమభట్టు ననుమానమును ఖండించు 'సాహిత్య చింతామణి' యను అలంకార శాస్త్ర గ్రంథమును రచించెను. (4) 'సంగీత చింతామణి' అట్టిదే. ఇవిగాక ఇంకను ఆ రెడ్డి నృపాలుని కృతు లుండియుండునని పరిశోధకులు తలచుచున్నారు.

రాజునకు తగిన మంత్రి మామిడి సింగన, ఇతడు సోమసిద్ధాంత మను జ్యోతిషశాస్త్ర గ్రంథమునకు 'గూఢార్థ దీపిక' అను వ్యాఖ్యానమును రచించెను. దాని రచనా కాలము 1418 సంవత్సరము.

పెద కోమటి వేమభూజాని సాహిత్య సార్వభౌముడు. సమరాంగణ పార్థమూర్తి. దాన కర్ణుడు. ఈ విషయములను వ్యక్తముచేయు చాటువులు సంస్కృతమునను, ఆంధ్రమునను ఉన్నవి. ఇరువది సంవత్సరములు కొండవీటి రెడ్డి సింహాసన మధిష్ఠించి కవి పండిత పోషకుడై నీతి మార్గము తప్పక రాజ్యపాలనము గావించి రెడ్డి సార్వభౌముడు అసమర్థుడైన కుమారుని చూచుకొని సగమును, రాజమహేంద్రవర రెడ్డిరాజన్యుల యొక్కయు, రాచకొండ వెలమరాజుల యొక్కయు బలవత్తరమై యెత్తివచ్చు శత్రుత్వములను చూచి సగమును ఆయువు పోగొట్టుకొనినాడు (1420). పెదకోమటి వేముని కుమారుడు రాచవేముడు 1424 సంవత్సరమున మరణించెను. శ్రీనాథుడు కంచికి వెళ్లెను.

## 4

కొమరగిరిరెడ్డి జీవించియున్న కాలముననే తన స్థితి కనేక విధముల కారకుడును, భావుకుడును అయిన కాటవేమారెడ్డికి రాజమహేంద్రవరమును పారితోషికముగా నిచ్చినట్లు తొత్తరమూడి రాజశాసనము చెప్పుచున్నది. కాటయ వేముడే రాజమహేంద్రవరము సంపాదించి అట అల్లాడరెడ్డిని ప్రతినిధిగా పెట్టినట్లు వెనుక చెప్పియున్నాను. కొమరగిరి తరువాత కొండవీటి సింహాసన మధిష్ఠించగా కాటయ వేముడు రాజమహేంద్రవరము చేరెను. (దీని మొదటి పేరు పితంద్రయట. శ్రీ చే. శా.) రాజమహేంద్రవరపు రెడ్డి రాజులలో కాటయ వేముడే మొదటివాడు. కొమరగిరి రెడ్డి యిచ్చినందున కాటయ వేమునకు రాజ్యము వచ్చినది. కాని, లేనిచో ఇదికూడ పెదకోమటి వేమారెడ్డికి సంక్రమింప వలసినది. రావలసినది రాకుండుట యెవరికైనను కష్టము కలిగించును. క్రమమో, అక్రమమో వచ్చినదాని నెవరును పోగొట్టుకొనరు. అందువలన పెదకోమటి వేమారెడ్డి రాజమహేంద్రవరమును జయించి ఆక్రమించుకొనుటకు చూచెను. అల్లాడరెడ్డిచేత రామేశ్వ

రము (గోదావరిజిల్లా) వద్ద యుద్ధమున పెదకోమటి వేము దోడింప బడెను. ఈ విషయము అల్లాడరెడ్డి పెద్దకుమారుడు వేమారెడ్డి వ్రాయించిన కోరుమిల్లి శాసనమున నున్నది. నిశ్శంక కొమ్మన యను నాతడు తన 'శివ లీలా విలాసము' న గూడ ఈ విషయము చెప్పి యున్నాడు. అల్లాడరెడ్డి, అతని సచివుడు అరియేటి లింగన యవన కర్ణాటక భూపతులతో మైత్రిని గలిగియున్నట్లు శ్రీనాథుడు తన భీమ ఖండమున చెప్పియున్నాడు. స్వయముగ అద్వితీయమైన పరాక్రమము గలిగి, కొందరు రాజన్యులతో మైత్రి గలిగియున్న అల్లాడరెడ్డిని జయించుట పెదకోమటి వేమారెడ్డికి తలకుమించిన పనియైనది. ఈ విధముగా కొంతకాలము గడచినది

అల్లాడరెడ్డి రెండవ కుమారుడైన వీరభద్రారెడ్డికి కాటయవేముడు తన కూతురైన అనితల్లి నిచ్చి వివాహముచేసి, అల్లాడరెడ్డితో గల సంబంధమును బంధుత్వముగా మార్చినాడు. దాని కల్లాడరెడ్డియు సంతోషించినాడు. కాటయవేముని తరువాత అతని కుమారుడు కుమార గిరిరెడ్డి రాజై వెంటనే మరణించెను అప్పుడు రాజమహేంద్రవర రాజ్యము అనితల్లికి రావలసియున్నది. ఆ యదనున వెలమలును, గజపతులును ఆ రాజ్యము నాక్రమింపజూచిరి. కాని అల్లాడరెడ్డి వారి నెదుర్కొని అనితల్లికే రాజ్య ముండునట్లుచేసెను. అనితల్లి భర్తయైన వీరభద్రారెడ్డి రాజమహేంద్రవర రాజ్య సింహాసన మధిష్ఠించెను. అతని అన్నయైన వేమారెడ్డి పరాక్రమవంతుడై కటకము వఱకు జయించి, రెడ్డి రాజ్యమును విస్తరింపజేసెను. ఇతడు శివపూజా తత్పరుడు. శ్రీనాథుడు ఇతనిని గూర్చి తన కాశీఖండమున వ్రాసియున్నాడు. అనితల్లి రాజ్యాధికారిణి. వీరభద్రారెడ్డి రాజు. అల్లయవేమారెడ్డి సర్వ నిర్వాహక చక్రవర్తియైన పాలకుడు. వీరి యనుజుడు దొడ్డారెడ్డి చేదోడువాదోడు.

కొండవీటి రాజ్యము పతనమైన తరువాత శ్రీనాథుడు కంచికి వెళ్లెనని వెనుక వ్రాసియుంటిమి. అచట హరవిలాసము రచించి, తన

చిన్ననాటి స్నేహితుడైన అవచి దేవయ తిప్పయకు కృతియిచ్చి, అట నిటు తిరిగి రాజమహేంద్రవర ప్రాంతము వచ్చినాడు. అప్పుడు వీర భద్రారెడ్డి రాజుగా నున్నాడు. అతనివద్ద బెండపూడి అన్నయ్య మంత్రిగ నుండెను. అతడు పాకనాటి నియోగి బ్రాహ్మణుడు. శ్రీనాథుడును పాకనాటివాడే. బాంధవ్యము కలసినది. అన్నమంత్రికి భీమేశ్వరపురాణము రచించి, (1430) కృతి నిచ్చినాడు. నెమ్మదిగా రాజాశ్రయమును సంపా దించుకొనినాడు. భీమేశ్వర పురాణ కృతి సమర్పణ మహోత్సవమునకు వేమారెడ్డి, వీరభద్రారెడ్డి వచ్చియుందురు. అప్రస్తుతమైనను, ఆశ్రయ మును కోరినవాడగుటచేత శ్రీనాథుడు భీమఖండమున ముందు వేమారెడ్డి, వీరభద్రారెడ్లను గూర్చి 14 గద్య పద్యములను చెప్పినాడు. వారి కీతని యందు గౌరవ మేర్పడినది. దగ్గఱకు తీసినారు. వారు శైవులు. శ్రీనాథుడు తానును శైవుడే. అంతకుపూర్వము దక్షిణ కాశి యని పేరు గాంచిన దాక్షారామమును వర్ణించియున్నాడు. అసలు కాశీనగర మాహా త్మ్యమునే వ్రాయవలసినదిగా వీరభద్రారెడ్డి కోరినాడు. శ్రీనాథు డుపక్ర మించినాడు. కాశీఖండమును రచించి, (1434) వీరభద్రారెడ్డికి కృతి యిచ్చినాడు. వీరభద్రారెడ్డి శ్రీనాథుని యాదరించి కృతిభర్త కాగా, అతని తమ్ముడు దొడ్డారెడ్డి నిశ్శంక కొమ్మన యను కవి నాదరించి, శివలీలా విలాసమను గ్రంథమును కృతిగైకొనెను. వీరభద్రారెడ్డి తరువాత 1438ప్రాంతమన కర్ణాటకాధీశ్వరుడైన ప్రౌఢదేవరాయలు రాజమహేంద్ర వరము నాక్రమించెను. శ్రీనాథుడు మరల దేశసంచారము చేయవలసిన వాడాయెను. శివరాత్రి మహాత్మ్యము (1440), పల్నాటి వీరచరిత్రము మొదలైనవానిని ఆ కాలమున శ్రీనాథుడు రచించెను.

రెడ్డిరాజన్యుల ప్రాపున నుండి శ్రీనాథుడు రచించిన గ్రంథములు మూడు : (1) శృంగార నైషధము (2) భీమేశ్వర పురాణము (3) కాశికాఖండము. శ్రీనాథునిగూర్చి అతని శిష్యుడును బావమఱదియు నైన దగ్గుపల్లి దుగ్గన తన నాచికేతోపాఖ్యానమున (1460)—

"సంస్కృత ప్రాకృత శౌరసేనీ ముఖ్య
భాషా పరిజ్ఞాన పాటవంబు
పన్నగపతి సార్వభౌమ భాషిత మహా
భాష్య విద్యా సమభ్యాసబలము
అక్షపాద కణాద పక్షితోదీరిత
న్యాయకళా కౌశలాతిశయము
శ్రుతి పురాణాగమ స్మృతి సాంఖ్య సిద్ధాంత
కబళన వ్యుత్పత్తి గౌరవంబు
పూర్వకవి ముఖ్య విరచితాపూర్వ కావ్య
భావ రస సుధా చర్వణ ప్రౌఢతయును
గందళింపంగఁ గాశికాఖండ నైష
ధ ప్రముఖ వివిధ ప్రబంధము లొనర్చె"

అని చెప్పినాడు ఇందువలన శ్రీనాధుని బహుముఖ పాండిత్యము వ్యక్తమగుచున్నది. ఇంత పండితుడు గనుకనే పెదకోమటి వేమారెడ్డి యాస్థానమున విద్యాధికారిగా నుండి బహుశాస్త్రములలో పండితులైన వారిని పరీక్షించగలిగినాడు. అతని గ్రంథములలో ఆ శాస్త్ర పాండిత్య స్ఫురణ యుండనేయున్నది. ఆ స్ఫురణ మధికముగా నున్న గ్రంథములు నైషధము, కాశీఖండ మగుట కాబోలును దేశమున ఆ గ్రంథములు ఉత్తమమైనవను ప్రచారము జరిగినది. ఆ ప్రచారమునకు కారకులు ఆ యా శాస్త్రములలో నుద్దండ పండితులు. మిగిలినవారు వారి యందున్న గౌరవమును బట్టియు, తమకు స్వయముగ నిర్ణయించుకొను శక్తి లేక పోవుటను బట్టియు ఆ మాట నంగీకరించి, అవకాశము లభించినపు డా మాటనే చిలుకవలె పలుకుదురు. కావ్యాంశ లోపించి, శాస్త్ర వైదుష్యము వెల్లివిరిసిన ఒక గ్రంథ ముత్తమకావ్యము కాజాలదు. కావ్యాంశకు శాస్త్ర పరిజ్ఞానము మెఱుగుపెట్టు పనిముట్టువలె నుండవలెను. శ్రీనాథుని మిగిలిన గ్రంథము లందు కంటె కావ్యాంశ భీమేశ్వర పురాణమున

అధికముగ నున్నదని నా విశ్వాసము. ఉత్తమ కావ్యమునకు ప్రధానమైన సంయమనముతో గూడిన భావుకత భీమేశ్వర పురాణమున నున్నది. ఇందువలన కాశీఖండ నైషధములు కావ్యములు గాదని నా యభిప్రాయ మని పొరపాటుపడరాదు. ఉత్తమ కావ్యగుణములు వానిలో కంటె భీమ ఖండమున అధికముగా నున్నవనియే నా యభిప్రాయము. భీమఖండము ఔచితిని బట్టి వాక్పాటవమును ఇముడ్చుకొనినది. శ్రీనాథుని మహా పండితుడని రుజువుచేసినది నైషధము. మహాకవి యని ధ్రువపఱచినది భీమఖండము. రెండిటిని ఇముడ్చుకొని పాండిత్యమువైపు ములు సూపించునది కాశీఖండము.

దొడ్డారెడ్డి కంకితమీయబడిన నిశ్శంక కొమ్మన శివలీలావిలాసము సమగ్రముగా లభింపలేదు. లభించిన దానినిబట్టి అతడు మధ్యతరగతి కవులశ్రేణిలోని వాడని ఆ కవిని నిర్ణయింపవచ్చును.

ఫణిరాజ మహాభాష్య ఫక్కికా పరమేష్ఠి సింగనార్యుడు, పెద్ది యజ్వ మొదలైన మహాపండితులు, వామన భట్టబాణ శ్రీనాథాది మహా కవులను ఆదరించి పోషించి ఆంధ్రవాఙ్మయమునకు పుష్టిచేకూర్చిన రెడ్డిరాజ్య మస్తమించినది. స్వతంత్రులైన రెడ్డిరాజులు ఆంధ్రదేశమున అధికారము నెఱపిన బంగారుకాల మంతమయినది. ఆంధ్రదేశమున సామంతులైన రెడ్డిరాజు లచ్చటచ్చట పరిపాలించిరి. వారును శక్తికొలది ఆంధ్రవాఙ్మయమును పోషించిరి. రాజమహేంద్రవర రెడ్డిరాజ్య మస్త మించిన తరువాత విజయనగరము రాజధానిగా ఆంధ్రదేశమును పాలిం చిన రాజన్యులలో శ్రీ కృష్ణదేవరాయలు ముఖ్యుడు. అతని కాలమున కొండమరుసయ్య యను బ్రాహ్మణుడు ఉదయగిరి దుర్గాధిపతిగానుండెను. అతనికి కప్పము గట్టుస్థితిలో గుడ్లూరు రాజధానిగా ఆ పరిసర ప్రాంత మును పాలించు పంట రెడ్డి రావూరి వంశజు డొకడుండెను. అతనిపేరు రాఘవరెడ్డి. తన తండ్రిపేర బసవాపురమను అగ్రహారమును వెన్నెల కంటి సూరనామాత్యునికిచ్చి అతనిచేత విష్ణుపురాణమును (మొదటి

భాగము) రచింపజేసి రాఘవరెడ్డి కృతిభర్తయయ్యెను. వెన్నెలకంటి సూరన పురాణరచనలో సిద్ధహస్తుడైనట్లు అతని గ్రంథము రుజువుచేసి చూపగలదు. ఇంకే గ్రంథములు రచించినట్లును ఇతడు చెప్పుకొని యుండలేదు. ఇతడు 1500-1550 ప్రాంతమువాడు.

గోలకొండ మహమ్మదీయ ప్రభువులకు సామంతులుగా బిక్కనవోలు సంస్థానమునేలు రెడ్డివంశ మొకటి యున్నది. వీరు కామినేనివారు. వీరు పాకనాటిరెడ్లు. వీరి వంశములో ఎల్లారెడ్డి యనువాడు బాలభారతము, కిరాతార్జునీయము అను రెండు గ్రంథములను కృతి నందినట్లు 1530-90 ప్రాంతమున ఆ సంస్థానమునేలిన కామిరెడ్డికి కృతి యీయబడిన సూతసంహితలో నున్నది. ఆ గ్రంథములు నేడు ఉపలభ్యములు గావు. కామారెడ్డి యాస్థానమున పట్టమట్ట సోమనాథ సోమయాజి యను పండితకవి యొక డుండెను. ఆతడు సూతసంహిత (1578) రచించి కామిరెడ్డికి కృతియిచ్చెను. ఆ రాజసోదరు లిరువురును కవిపోషకులు, కృతిభర్తలు, వారి తమ్ముడు మల్లారెడ్డి బహుగ్రంథకర్త. ఎల్లారెడ్డిగూడ వాసిష్ఠ లైంగధర్మ మను గ్రంథము రచించినట్లు మల్లారెడ్డి తన పద్మపురాణమున చెప్పినాడు. కవిపోషకులు, కృతికర్తలు అయిన ఈ కామినేని రెడ్డి రాజన్యుల యాస్థానముననున్న పట్టమట్ట సోమనాథ సోమయాజి కవితావిలాసమున శ్రీనాథునితో తులతూగు చుండునని శ్రీ చాగంటి శేషయ్యగారు వ్రాసినారు. ఇతని గ్రంథములలో పద్యరచనా విధానము శ్రీనాథుని దానివలె నుండుట గమనించితిని.

అస్మద్గురుస్వామి యైన లింగారాధ్య
సార్వభౌము ప్రసాద సౌష్ఠవంబు
ఆత్మాప్తుడు సతీర్థ్యుడైన కామారెడ్డి
పట్టభద్రుని ధర్మపాటవంబు
తత్సభాసదులైన ధన్య విద్వాంసుల
సంతత సల్లాప సమ్మతంబు

ఘనుడు విద్యారణ్యముని యేర్పరించిన
తాత్పర్య దీపిక దారికలిమి.
కారణంబులుగా నిరాఘాట చాటు
శుద్ధపద్ధతిఁ దెనుగున సూత సంహి
తా చతుర్విధ ఖండ సందర్భమెల్ల
గావ్య మొనరింతు లోక విఖ్యాతముగను

సూతసంహిత —సోమయాజి

"ఆంధ్రక్షమామండలాఖండలుండైన
వేమభూపతి కృపావీక్షణంబు
ఘోడె రాయాంక సద్గురురాజ భీ
మేశ్వరస్వామి పదసమారాధనంబు
కమలాద్రినిలయ మార్కండేయ శివమౌళి
చంద్రాంశు నవసుధాసారధార
వేదాద్రినరసింహ విపులవక్షస్థలీ
కల్హారమాలికా గంధలహరి
కారణంబులు నుద్బోధకములుగాగ
సంభవించిన సాహిత్య సౌష్ఠవమున
వీరభద్రేశ్వరుఁ బ్రబంధవిభుని జేసి
కాశికాఖండము దెనుంగుగా నొనర్తు.

కాశీఖండము —శ్రీనాథుడు.

శ్రీనాథుని కాశీఖండపద్యమును మనసున బెట్టుకొనియే సోమనాథ సోమయాజి సూతసంహితలో ఆ పద్యము రచించి యుండుననుట నిర్వివాదాంశము. రచనా విధానమున శ్రీనాథుని యనుకరించుటకు యత్నించి నను శిల్ప నిర్వహణమున వెనుకబడక తప్పినదికాదు. సోమనాథ సోమయాజి ఆ శతాబ్దపుకవులలో నుత్తమతరగతికి చెందినవాడనుటలో ప్రతిపత్తి లేదుగాని కవితావిలాసమున శ్రీనాథునితో తులతూగునను విషయము

నంగీకరింపలేము. సోమనాథ సోమయాజి, శ్రీనాథుని యంతటి పండితుడు కావచ్చును గాని అంతటి కవిమాత్రము కాడు. శ్రీనాథునితో పోలికను వదలినచో సోమనాథ సోమయాజి ఉత్తమ పండిత కవులలో చేరగలడు. అట్టివానిని ఆదరించి పోషించిన గౌరవము సామంతమైన కామినేని రెడ్డివంశము దక్కించుకొనినది. ఎల్లారెడ్డి రచించిన "వాసిష్ఠ లైంగ ధర్మము" నే డుపలభ్యముకాదు. అతని తమ్ముడు మల్లారెడ్డి (1) షట్చక్రవర్తి చరితము (2) శివధర్మోత్తర ఖండము (3) పద్మ పురాణము రచించెను మొదటి గ్రంథమున హరిశ్చంద్రుడు, నలుడు, పురుకుత్సుడు, పురూరవుడు, సగరుడు, కార్తవీర్యుడు అను ఆరుగురు రాజన్యుల చరిత్రము ఆ ఆశ్వాసములలో వర్ణింపబడినది. మొదటి రెండు కథలు మిగిలినవానికంటె రసవత్తరములు, రెండవ గ్రంథము ధర్మశాస్త్ర విషయ వివరణము. కవిత్వ ముండుట కంతగా తావులేని గ్రంథ మది. మూడవది శివ ప్రభావమును నిరూపించు గ్రంథము. అయిదాశ్వాసములు. కావ్య గుణములను కొన్నింటి నిముడ్చుకొనినది

"చొటచొట తేనియల్ వడయు సూక్తులు ప్రాక్తనజన్మ పుణ్య సం
ఘటితములై కవీంద్రుల కఖండ ముదంబు హృదంబుజంబునం
బొటమగజేయఁ గ్రమరసపూరముగా మహిత ప్రబంధముల్
పటుమతి సల్పగాఁ దగిన ప్రాజ్ఞుడు మల్లనృపాలు డెంతయున్.

పద్మపురాణము —మల్లారెడ్డి.

తనను గూర్చి మల్లారెడ్డి చెప్పుకొనిన పై పద్యము కేవల మతిశయోక్తి మాత్రము గాదు. మొదటి రెండింటిలోకంటె పద్మపురాణమున పరిణతమైన కవితా శక్తి యున్నది. ఇదిగాక మల్లారెడ్డి మఱికొన్ని కృతులను రచించినట్లు చెప్పుదురు గాని వివరములు తెలియరావు.

ఇంతటితో బిక్కనవోలు సంస్థానాధీశుల వాఙ్మయ పోషణమును ముగిసినది. వీరి తరువాత నగరాధిపతులైన రెడ్డి వంశజులుకూడ తమ

శక్తినిబట్టి వాఙ్మయము నాదరించిరి. వారిలో కర్ణాటతిలకుడును, పరిపాలనా భార ధౌరేయుడును, లలిత చౌషష్టికళా ప్రవీణుడును నైన జంగాల ముమ్మయరెడ్డి ముఖ్యుడు. ఇతనిని గూర్చిన చారిత్రక విషయము లింకను పూర్తిగా తెలియరాలేదు. ఇతడు ద్విపద భారత కర్తయైన తిమ్మయ కవి నాదరించి అతనివలన భారత విరాట పర్వమును కృతి నందుకొనినాడు. ఆ కవి పోషణ భారమంతయు వహించి ద్విపద భారతము నంతయును, తిమ్మయ వ్రాసిన దంతయును, కృతినందు భాగ్య మా రెడ్డివంశజునకు లేకపోయినది కాబోలును, ఒక్క విరాట పర్వముతోనే తృప్తిపడి యూరకుండినాడు. ఈ కవియు, కృతిపతియును నెల్లూరు మండలి బట్టేపాడు గ్రామస్థులు. ఆ గ్రామమే ఆ ముమ్మయరెడ్డి అధికారములో నుండెడిదేమో! ఈ కవి కాలము 1550-1600 కావచ్చును. కవిత్రయము వారిభారతము నాధారముగ తీసికొని ఈ తిమ్మన, అటు తరువాత సోమన, బాలసరస్వతి యనువారు ద్విపదభారతమును రచించిరి

1640-1670 ప్రాంతమున కొండవీటి సీమలో నున్న భక్తవాడ పురాధిపతియైన తుమ్మ రాయపరెడ్డి, పింగళి ఎల్లన యను కవి నాదరించి అతనిచేత సర్వేశ్వర మాహాత్మ్యము (తోభ్యచరిత్రము) ను రచింపజేసి సర్వేశ్వరున కంకితమిప్పించెను, ఆ భక్తవాడయను పురమేదో యింకను తెలియలేదు.

1750 ప్రాంతమున గద్వాల సంస్థానమును పాలించిన సోమ భూపాలుడు కాణాద పెద్దన సోమయాజి యను కవి నాదరించెననియు ఆకవి (1) అధ్యాత్మ రామాయణము, (2) ముకుందవిలాసము అను గ్రంథములను రచించెననియు, సోమభూపాలుడు స్వయముగా కవియై జయదేవ గీతగోవిందమును ఆంధ్రీకరించెననియు చెప్పుదురు.

1825-70 ప్రాంతమున బళ్ళారి మండలమున నున్న జూహరా పురాధిపతియైన సంజీవరెడ్డి యను నాతడు గురురాజు అను కవిని పోషించినట్లు కవుల చరిత్ర చెప్పుచున్నది. ఆ కవి రచించిన గ్రంథ

ములు (1) పద్మావతీ పరిణయ నాటకము (2) రుక్మిణీ పరిణయ కావ్యము (3) రాఘవేంద్రాష్టకము (4) అనిరుద్ధచరిత్ర నాటకము (5) భర్తృహరి శతకముల కాంధ్రీకరణము (6) శేషధర్మములు, ఇవిగాక ఇంకను కొన్ని కర్ణాటక కృతులుకూడ రచించినాడట. శేష ధర్మములు దక్క మరేగ్రంథమును లభ్యము కాలేదు. పై గ్రంథముల నన్నింటిని కవి తన చివర కృతియయిన శేషధర్మమున పేర్కొనినాడు.

మల్లారెడ్డి దేశాయి యను నతడు గంగాపుర మాహాత్మ్యమును రచించెను. 1900 ప్రాంతమువాడు. అత డే ప్రాంతమువాడో యింకను తెలియలేదు.

రెడ్డి వంశజులు ఆంధ్ర వాఙ్మయమును శక్తివంచన లేకుండ పోషించిరి. రెడ్డి రాజన్యుల కాలమున ఆంధ్రదేశమున నొక అద్వితీయ మైన తేజము ప్రసరించినది. రాజాశ్రయకారణముగా ఆంధ్రి నాడొక వింత సోయగ మలవరుచుకొన్నది. రాజగౌరవము వలన ఆంధ్రభాషా వాఙ్మయములకు నూతన వికాస పరిణామములు నాడు కలిగినవి. ఆ వికాస పరిణామములే అచ్చమైన ప్రబంధ కవితకు నాంది ప్రస్తావన లైనవి. అద్దంకి, కొండవీడు, రాజమహేంద్రవరములను పాలించిన రెడ్డిరాజుల అడుగుజాడలలోనే తరువాత సామంతులుగా నున్న రెడ్లు నడచిరి. చాలమంది రెడ్డిరాజులు శైవులు, కవులు శైవులు, ప్రజలు శైవులు. వీరశైవులు మాత్రము కాదు. కనుకనే వైష్ణవ గ్రంథములును ఆనాడు ఉద్భవించినవి. కాకతీయులలో లేని పరమత సహనము రెడ్లలో నున్నది. వెనుకటి చరిత్ర నర్థముచేసికొని దాని నూతగా గొని సత్పథ మున ముందు కడుగిడుటలో రెడ్డిరాజు లద్వితీయులు. రెడ్డివంశమునకు శైవమువలెనే బ్రాహ్మణ భక్తియు మొదటినుండియు అంటిపెట్టుకొని యున్నది. ఆ రెడ్డిరాజుల యాస్థానములు కవులతోను, పండితులతోను, గాయకులతోను, శిల్పులతోను నిత్య కల్యాణము, పచ్చతోరణములునై కళకళలాడుచుండెడివి. ఆంధ్రదేశమున లలితకళలకు రెడ్డిరాజు లిచ్చిన

దోహదము మఱపునకురానిది. కళల నెట్లాదరించిరో సామాన్య ప్రజా జీవితమును అట్లే ఉన్నతస్థితిలో నుంచిరి.

ఇప్పటికి జరిగిన పరిశోధనను బట్టి రెడ్డిరాజులచేత పోషింపబడిన కవిపండితుల సంఖ్య ఇరువదిమంది. పదిమంది రెడ్డిరాజులు స్వయముగ పండితులు, కవులు, బహుగ్రంథకర్తలు. కృతిభర్తలైన రాజులు పదముగ్గురు. ఈ రాజులకు మంత్రులైనవారిలో నిరువురును, ఆశ్రితులలో నొకడును గూడ కృతిభర్తలైరి. రెడ్డిరాజులును, వారిచేత పోషింపబడిన కవులును వ్రాసిన గ్రంథములును ఏబదికి పైగా నున్నవి. అందు ముప్పదికి పైగా ఆంధ్రగ్రంథములు, ఇతిహాసములు, పురాణములు, కావ్యములు, ప్రబంధములు, నాటకములు, వ్యాఖ్యలు, అలంకార శాస్త్ర ములు, ఇత్యాది వాఙ్మయ శాఖలన్నియు రెడ్డిరాజుల పోషణమునను, కృషివలనను అనాదభివృద్ధియైనవి. ఎనలేని విధమున ఆంధ్రవాఙ్మయ మును పోషించి రెడ్డిరాజులు కీర్తిశేషులై నిలిచినారు.

★

## ప్రాచీన భారతీయ విద్యా విధానము

శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యులు

మానవుని ఆవిర్భావము కంటె పూర్వమే విద్య యున్నది. ఉన్న విద్యను దర్శించుటయే మానవుని భాగ్యము. ఈ కారణముననే జ్ఞానులు జ్ఞానమును పౌరుషేయముగా కీర్తింతురు. ఆనందమునకు కారణము కార్యము అగు వస్తువు విద్య. మానవు డానందము నుండి పుట్టినవాడు గనుక జ్ఞానము ద్వారా ఆనందమునే కోరుచుండును. అది వానికి సహజము. అందువలన మానవునకు విద్య నభ్యసించుటకును, జ్ఞానము నార్జించుటకును కారణముండదు. ఇదియే భారతీయుల విశ్వాసము అందువలన ప్రాచీన భారతీయ విద్యల విషయమున నీ యంశము మన కెంతవర కుపయోగము అన్న ప్రశ్న యుండెడిదికాదు. వారికి విజ్ఞానమునకును, వినియోగమునకును భేదము కనబడదు. మానవుని దైనందినావశ్యకములగు అన్న వస్త్ర సముపార్జనము వారికి విజ్ఞానమే. వారు చేయు ప్రతి పనియు వారి కొక దివ్యమగు విజ్ఞానమార్గము చూపుటకే తోడ్పడుచుండెడిది. వారికి లోకమున హేయమగు విషయమే లేదు. అల్పవిషయములలో నాంతర సత్యములు నేర్పుట వారి నేర్పు. అందువలన వారికి పాఠశాలలు, విశ్వవిద్యాలయములు నలంకారప్రాయములే గాని యావశ్యకములు కావు. ప్రకృతియే మహా విద్యాలయము. అందలి పర్వతములు, నదులు, మహావృక్షములు మొదలు భవన ప్రాసాదకాసారోద్యానముల దాక నన్నియు విద్యాలయములే. అందు గల మహారహస్యముల నుపాసించి, శిష్యులవలె గ్రహించుట, లాలించి, బుజ్జగించి తాము చెప్పినట్లు వినిపించుట మొదలగు విషయములే వారి విద్యాభ్యాసములు.

ప్రాచీనులు తొలుదొల్త నరణ్యములలో గణములుగా నివసించు కాలము నుండి వేదములు ఈనాడు మనకు దెలిసిన విధమున దర్శింప బడినవి. వారు అనాది నుండియు జ్ఞానమునకై పరిశోధనచేసి చివరకొక విచిత్రమగు నిర్ణయమునకు వచ్చిరి. అది యేమనగా విషయబాహుళ్యము తెలియుట జ్ఞానము కానేరదు. ఆ విషయబాహుళ్యమున కుపకరమైన ఏకత్వము దర్శించుటకై పాటుబడవలెను. ఆ మొదటి విషయము నుండి అలలుఅలలుగా విపులములగు విషయము లాయాకాలములం దుద్భవించి, నటించి, లయమందుచుండును. నదిలోనున్న జలముయొక్క తత్త్వము గ్రహించుట జ్ఞానముగాని యా నదిలో సుడులు, అలలు లెక్కించి వాని యాకారాది విశేషములకై తడవుకొనుట జ్ఞానముకాదు. ఈ విషయ బాహుళ్యము ఇంద్రియముల మూలమున గ్రహించి, జ్ఞానమును చేరుకొన వలసినది పురుషుడు గదా! ఆ పురుషునిగూర్చి తెలిసికొనినచో నంతయు తెలియునని వారి నిర్ణయము. జ్ఞాన సముపార్జనా విధాన మెట్లో తెలుపు జ్ఞాన మిది ఆ జ్ఞానము నావరించుకొనుచున్న తన లక్షణము తనకు తెలిసినచో జ్ఞానము పారము చూచినట్లే. ఈ విధమైన విద్యాభ్యాస మార్గమున కుపదేశ పద్ధతి వేరుగా నుండును. జ్ఞానము యొక్క వివిధ కిరణములను వర్ణించుటవలె సామాన్యమైన పద్ధతి యిచ్చట పనికిరాదు. "నీలో సమస్తము తెలిసికొనవలసినవా డున్నాడు. వానిని తెలిసికొనుము" అను నుపదేశము దీని కవసరము. మన ప్రాచీనులు అక్షరాభ్యాసమున చేయున దీ యుపదేశమే. పై వాక్యము నుపదేశించి దానినే మఱచిపో కుండునట్లు మరల మరల జపింపుమని చెప్పుదురు. దానితో విద్యార్థి పెరుగుట యారంభించి స్వయంపూర్ణుడగును. అనగా తన విజ్ఞానమయ శరీరముతో విశ్వమెల్ల వ్యాపించి సర్వాంతర్యామి యగును. అతని కితరవిషయముల భిన్నత యుండదు ఉన్నదంతయు తానే. ఆ యున్నదే తాను. అనగా సర్వము తానగును. ఆ ప్రజ్ఞయే "సోహమ్" అను రహస్యము.

ఈ విధమయిన విద్యారంభమే ఉపనయనము. ఉపనయనమనగా గురువు కడకు గొనిపోవుట. ఆ రహస్యమును తొలుత దర్శింపజేయు వాని యోగ్యతనుబట్టి విద్యార్థి పెరుగుదల ప్రవర్తించును. అందువలన నా రహస్యము వానికి గోచరింపజేయువాడే గురువు. ఆ గురువు విద్యార్థితో తొలుత నీ రహస్యమును కంఠమెత్తి గానము చేయును. అప్పుడది సమస్త జ్ఞానమును దర్శింపచేసి రక్షించును. గానముచేయగా రక్షించుట వలననే యా రహస్యమును గాయత్రి యనిరి. ఈ గాయత్రిని బోధించి యటుపైన భిన్నశాస్త్రముల నభ్యసింపజేయుట గురువులకు పరిపాటి. మనోవికాసము ననుసరించి యీ విద్యారంభకాలమునకు భిన్నభిన్న ఋషులు భిన్నభిన్నమైన వయస్సు చెప్పియున్నారు. సర్వసామాన్యముగా గర్భాష్టమ సంవత్సరమున బ్రాహ్మణునకును, గర్భైకాదశ సంవత్సరమున క్షత్రియునకును, గర్భద్వాదశ సంవత్సరమున వైశ్యునకును ఉపనయనము మనువు విధించినాడు.

"గార్భాష్టమే ప్రకుర్వీత బ్రాహ్మణ స్యోపనాయనమ్
గర్భాదేకాదశే రాజ్ఞో గర్భాత్తు ద్వాదశే విశః"

ఇదిగాక వీని కపవాదములును చెప్పబడినవి. ఆయుష్కాములకు మఱియొక వత్సరము తరువాతను, బ్రహ్మవీర్యస్కాములకు మఱియొక వత్సరము ముందుగను విద్యారంభముచేయుట నైమిత్తిక విధి. బుద్ధున కైదవయేట నుపనయనమైనట్లు జాతక కథలు చెప్పుచున్నవి. మొదట నీ యుపనయనము విద్యార్థి తండ్రియే చేసెడివాడు. అటుపైని వారివారి వృత్తిని, మనోధర్మమును అనుసరించి మిగిలిన విద్యలను బోధించెడివాడు, అరణ్యములలో ప్రజలు గణములుగా నివసించుటవలన కొంతమంది యొక్కొక్క గణములో నొక వయస్సు పిల్లలందఱ కొకసారిగా బ్రహ్మోపదేశము జరుగుచుండెడిది. వారందఱకు గలసి ప్రాథమికవిద్య నేర్పెడివారు. ఈ విధముగా నొక్కొక్క సంవత్సరము ఒక్కొక్క విద్యార్థిగణము తయారై విద్యారంభముజరిగెడిది. ఈ విద్యారంభమునకు

పర్వదినములు, గ్రహణములు, నదీ పుష్కరదినములు శుభములుగా నెంచెడివారు.

ఇట్లు విద్యారంభము చేసిన యొక్కొక్క కక్ష్యలోని విద్యార్థులు, ఎవరియిండ్లలో వారు విద్యాభ్యాసము చేయుటయే గాక, క్రమముగా నొక పెద్దవానికడనే యితరుల పిల్లలందఱును విద్య నభ్యసించుట కొంతకాలమునకు పరిపాటియైనది. వారంద అనుదినము కుటీరమును వదలి నదీతీరములయందును, వృక్షచ్ఛాయలయందును, గురువు సన్నిధిని శాస్త్రముల నభ్యసింతురు. దీనికి కారణమున్నది. చిన్నచిన్న గదులలో విద్య నభ్యసించినచో మనస్సు సంకోచస్థితియందుండగా విద్యనేర్చుట జరుగును. విశాలావకాశమగు నాకాశము క్రింద నదులు, పర్వతములు, వృక్షములు చూచుచు విద్య నభ్యసించుటవలన మనస్సు, హృదయము విప్పారియున్నదశలో విద్య నభ్యసించుటయు, ప్రత్యక్ష ప్రకృతి పరిశీలనయు నొకేమారుగ గలుగును. టాగూరు మహాశయుడు కూడ నీ విషయమునే తన సాధనయను గ్రంథమున వెలిబుచ్చినాడు.

అప్పటి యరణ్యములలోని గణములు గ్రామములని పేరు పొందినవి. గ్రామము, గణము అను పదములు సమానార్థకములు కాగా నీ పరిణామము వచ్చియుండవచ్చును. ఒక్కొక్క గ్రామమున నొక్కొక్క గురువుండుటంబట్టి ఒక్కొక్క విద్యాలయమేర్పడినది. ఈ విద్యాలయమును గురుకులమందురు. ఇచ్చట కులమను పదము చాతుర్వర్ణ్యములకు వ్యతిరేకముగా వర్తించును, అందువలన గురువుకడ విద్య నభ్యసించుచున్నవారికి కులభేదములు లేవని తెలియనగును. ఒక విద్యార్థిని మీదేకులమని ప్రశ్నించినచో గురుకులమని ప్రత్యుత్తరమిచ్చును కాబోలు. అంతేకాదు. ఒక విద్యార్థియింట తలిదండ్రులకు గలిగిన సూతికాది అశౌచములు విద్యానిష్ఠలో నున్న శిష్యునకంటవు. అతడు విద్యానిష్ఠలో నున్న నైష్ఠిక బ్రహ్మచారి.

ఈ విధముగా కాలక్రమమున కొందఱు గురువులై యదేవృత్తిగ నేర్పడినారు. అప్పటినుండియే గురుదక్షిణ బయలుదేరినది. కాని యీ గురుదక్షిణ విధానమున కొక విచిత్రమున్నది. ఏ యింటివాడును తన కుమారునకొకనికి గురుదక్షిణ నీయరాదు. ప్రతి తండ్రియు, ప్రతి విద్యార్థికిని సమానముగా సహాయము చేయవలెను ఎంత గొప్పవారి బిడ్డయైనను నిది తప్పదు. "చరే దై్భక్షం యథావిధి" యని మనువు శాసనము. భిక్షాటన పద్ధతివలన జిజ్ఞాసువు కానున్న పిల్లవానికి వినయ సంపత్తి, సమదృష్టి, ఓర్పు మొదటినుండియు నేర్పకయే అలవడును. అట్లు తెచ్చిన గురుదక్షిణయంతయు నిరవశేషముగ గురువునకు శిష్యు డప్పచెప్పవలయును.

ఈ గురు దక్షిణ సమర్పించుటలో శిష్యు డేమైన దాచుకొనినట్లు గురువునకు తెలిసినచో నిక నా శిష్యుడు విద్యాభ్యాసమునకు కొంతకాల మర్హుడు కాడని బహిష్కరింపబడును. అప్పటి విద్యార్థి జీవితము చాల యర్థవంతమైనది. ఇంటినుండి గురుకులమునకు వచ్చు విద్యార్థి రెండు ధోవతులు, రెండు ఉత్తరీయములు మాత్రమే కొనిరావలెను. ఎంత ధనవంతుని బిడ్డయైనను ఇది తప్పదు. అంతేవాసిదశలో నేవస్తువును దాచుట కలవాటు పడరాదు. అప్పుడే అతని మనస్సు సంకోచములేక విద్యాభ్యాసమున కనువై యుండును. అంతేవాసి కొక నిర్ణీతమగు వేష మున్నది. ఒక కౌపీనము, మోకాలి పైకి ధోవతియు, ఎడమ భుజము మీదనుండి వ్రేలాడుచు, కుడిచేతిక్రింద ముడివైచిన యుత్తరీయమును, నడుమునకు గట్టిగా బిగించిన పటకాయును, చేతనొక దండము ధరించి అంతేవాసి స్వకార్య సముద్యుక్తుడై యుండవలెను.

గురుకులమున చేరినతోడనే అంతేవాసి గ్రంథము లభ్యసించుట యారంభింపడు. అతడు తొలుత 'సద్వృత్తము' అనబడు దినచర్య నలవాటు చేసికొనును. అందు శుచిత్వము మొదటిది. "శిక్షయా చ్ఛౌచ మాదితః" బ్రాహ్మ ముహూర్తమున నిద్రలేచుట. కాలకృత్యములను

నిర్వర్తించుట. స్నానము మున్నగు దినచర్యలో విద్యార్థి స్వయం ప్రవర్తకుడు గావలెను. ఈ సాధన ముగిసినవెనుక సమస్త శాస్త్రముల కును సాధకమైన భాషాశాస్త్రము ప్రాథమికముగా బోధింపబడును. ఇందు ఉచ్చారణ చక్కబడుటకు శిక్షా శాస్త్రము మొదటను, వ్యాకరణశాస్త్ర మటు పైనను, తరువాత వేదాధ్యయనమున కవసరమగు ఛందస్సు, వేదార్థ మును గ్రహించుటకు నిరుక్తమును, చదివినదానిలోని వృత్తులు ఆచరణలో పెట్టుటకు కల్పమును. ఈ ఆచరణకు గావలసిన కాలములను కని పెట్టుటకు జ్యోతిషమును అభ్యసించి అటుపైన విద్యార్థులు వేదా ధ్యయనము చేయవలెను. ఈవిధమైన విద్యాభ్యాసమువలన విద్యార్థి నేటి విద్యావంతునివలె గుమాస్తా పనికి మాత్రము పనికివచ్చువాడుగాక కర్మ పిరుడై, వృత్తులలో ప్రవీణుడై తన బ్రతుకు తాను బ్రతికి లోకోపకారము చేయగలవాడుగా పరిణమించును.

నాటి విద్యాభ్యాసములో వ్రాతపద్ధతి చాల తక్కువ. విద్యలు కంఠస్థమగుట ముఖ్యము. వాక్యములు సరియయిన 'ఉచ్చారణ' పొంది నప్పుడే వాని యర్థము సంపూర్ణముగా స్పష్టము కాగలదు. ఉచ్చారణకు స్వరమవసరము. కనుకనే వేదములు స్వరప్రధానములు. గురు వుచ్చ రించుచుండగా గురువుతోబాటు శిష్యుడును ఉచ్చరించును. స్వరము తప్పక కంఠస్థము చేయవలెను. ఈ విద్యలు గురువు నొద్ద నేర్చునవి యనుటకంటె గురువుతోడ నేర్చునవి యనుట సమంజసము. సహా ధ్యాయి అందువలననే నియమపూర్వక విద్యాభ్యాసమునందు ఆఖ్యాతకు "తోడ" వర్ణకము వచ్చును. అని వ్యాకరణ శాస్త్రము చెప్పుచుండును. ఈ బోధనా పద్ధతినే "ఉపయోగ" మని చెప్పుదురు. 'ఉప+యోగము' అనగా కలసి మెలగుట యని యర్థము. ఈ విధముగ కంఠస్థము చేయ బడిన విద్యలకు మొదట గురువులు స్థూలమైన యర్థము మాత్రము చెప్పుదురు. అటుపైన శిష్యుడు వయఃపరిపాకమునుబట్టి మనస్సు పెరిగిన కొలదియు ఈ శాస్త్ర వాక్యములు విస్ఫారి యావజ్జీవితమునకు

సమన్వయించును. అందువలన ఈ విద్యాభ్యాసమునకు మూడంతరువులు చెప్పబడినవి. (1) శ్రవణము (2) మననము అనగా ఆలోచించుట (3) నిధిధ్యాసము అనగా దానియందు నిష్ఠ కుదురుట. నోటబట్టి శాస్త్ర వాక్యములు శిష్యునకు సర్వకాల సర్వావస్థల యందును మనస్సున మెలగుచుండుటచే వాని సంస్కార మతనికి తల్లివలె వెనుక నిలిచి అభివృద్ధికరమై మెలగును.

అప్పటి బోధనాపద్ధతులు రెండు విధములు. మొదటిది - పలు విషయములకు ఏకత్వము కలిగించి క్లుప్తముగా తెలుపుట. ఇది ప్రారంభ దశలో నేర్పెడు విద్యాపద్ధతి. పసివారి మనస్సు విషయ బాహుళ్యమును భరింపదు గనుక ఈ పద్ధతి యవలంబింపబడెడిది. రెండవది - విషయ మును పలువిధములగు దృక్పథములతో సమన్వయించుట. ఇది ఉన్నత విద్యార్థి కవసరము. ఇందు మొదటిది సూత్రపద్ధతి. రెండవది బ్రాహ్మణ పద్ధతి. మొదటిపద్ధతికి చెందినవి మంత్రములు. మననము చేయదగిన వగుటవలన నివి మంత్రములనబడును. బ్రాహ్మణ పద్ధతికి చెందినవి బ్రాహ్మణములు ఇవి రెండును అప్పటిబోధనా పద్ధతులలో ముఖ్యములు.

అప్పటి విద్యాభ్యాసము చెట్లక్రింద జరిగెడిదని చెప్పియుంటిమి గదా. అందు ముఖ్యముగా మఱ్ఱిచెట్టు క్రిందను, రావిచెట్టు క్రిందను జరుగుట యాచారము. ప్రాచీన వృక్షశాస్త్రమునను సరించి యీ రెండు వృక్షములును వనస్పతుల కుటుంబములోనివి. అనగా పుష్పములు పూయకయే కాయలు కాచునవి. ఆ వృక్షములవలెనే విద్యాభ్యాసము త్వరితగతిని ఫలోన్ముఖము కావలెనని వారి యాశయమేమో. అంతియ గాక కనబడు సామాన్య వస్తువులలో కనబడని విశేష విషయములను పోల్చిచెప్పుట వారి సునిశిత బోధనా పద్ధతులలో నొకటి. అందువలన రావిచెట్టును సంసారవృక్షమునకు పోల్చిచెప్పిన సారమంతయును పరం పరగా రాగా అది యొక ప్రత్యేక మార్గమైనది. దీని సారాంశమంతయును భగవద్గీతలోని పురుషోత్తమ ప్రాప్తియోగమున మొదటి రెండు శ్లోకము

చెప్పెను. గురువు దానిని గూడ నిషేధించెను. శిష్యుడు పాలుత్రాగుచున్న దూడల మూతికడ వచ్చు నురుగు త్రాగి జీవించెను. గురువు దానినిగూడ నిషేధించెను. శిష్యు డాకలితో జిల్లేడు చెట్ల ఆకులు తిని కన్నులుపోయి, ఒక పాడు నూత బడెను. గురువు వెదకికొనుచు వచ్చి వానిని కనుగొని విషయమంతయు గ్రహించి, అంధత్వముపోవుటకయి అశ్వినీదేవతలను స్తోత్రముచేయుమనెను. అప్పుడు శిష్యు డావేదనతో చేసిన స్తోత్రములో కాలచక్ర రహస్యములన్నియు వాని హృదయమును పెకల్చుకొని వెలువడినవి. గురువు వానిని కంఠస్థముచేసెను. ఆ స్తోత్రములోని రహస్యముల ననుసరించి శిష్యుని అంధత్వమును పోగొట్టెను. ఆ స్తోత్రములే నేటి ఋగ్వేదములోని అశ్వినీఋక్కులు. అప్పటి నుండియు ఆ గురువు వానిని ప్రాణసమానముగా చూచుకొనెను.

ఈకథ సంస్కృత భారతములోనిది. ధ్వని గర్భితమయిన వ్యాసుని వాక్కులలోని ఈ కథలో పెక్కు విశేషములున్నవి. మనకు కావలసి నంతవరకు నాటి బోధనపద్ధతి కేవలము గ్రంథ పఠనముపై నాధారపడి యుండెడిది కాదనియును, పాడిపంటలు చూచుకొనగల సామర్థ్యము నేర్పనిదే నాడు విద్యాభ్యాసమే లేదనియును, నిత్యజీవిత వృత్తులకు దేశ సౌభాగ్య నిర్మాణమునకు తోడ్పడని విద్యను వారు లెక్కచేసెడి వారు కారనియును తేలుచున్నది.

అప్పటి విద్యార్థుల సంఘ జీవితము చాల ముచ్చటగా నుండెడిది. గురువును, శిష్యులును కలిసి అనుదినము ఈ విధముగా చెప్పుకొనెడి వారు. మనమందఱము ఎచ్చటికిపోయినను కలసిపోవుదము. కలిసి ఒకేమాట మాటాడుదము. సమాన మనస్సులతో నుందము. జ్ఞానులయిన పూర్వులు ప్రవర్తించిన మార్గమున ప్రవర్తింతము. మన యూహలు, హృదయములు, చిత్తము, సంకల్పము, కుతూహలము సమానముగ నుండి మనమందరము కలిసి మెలగుదము. విద్యార్థిదశలో అభ్యాసమైన

సూత్రమే జీవితమంతయును వర్తించి వారాజన్మవిద్యార్థులుగా ఉండునట్లు లోనచ్చెడిది. పసితనమునుండియు వారికి చక్కని నీతి బోధ లభించెడిది. "మొదట తలిదండ్రులు, అటుపైన గురువు, ఆపైన అతిధియు, దేవతలుగా పూజింపబడుదురుగాక. అనింద్యములయిన కర్మల ననుష్ఠింపుడు. ఇతరములను మానుడు. మాలోనున్న మంచిని మాత్రమే నేర్చుకొనుడు మిగిలినది విడిచిపెట్టుడు." అని గురువు అనుదినము శిష్యులకు ఉపదేశించెడివారు. ఈ యుపదేశమంత్రములు పిల్లలకు పనికివచ్చునట్లు చిన్నచిన్న వాక్యములుగా మృదుమధురమైన భాషలో చెప్పబడినవి. వానిని మనము నేటికిని శాంతిపాఠములయందు చూడవచ్చును. ఈ శాంతి పాఠములు వేదమంత్రములకు ఆదిని అంతమున నుండుట చూడగా గురువు పాఠమారంభింప బోవునపుడును, పాఠమైపోయిన వెనుకను అనుదినము శీలసంపదను గూర్చి నేర్పెడివాడని తోచుచున్నది. ఈవిధముగ నడవడి చతుర్విధ పురుషార్థముల సంపత్తి కల్గియుండి ఆ నాల్గింటికి పరస్పర విరోధములేకుండు విధానము నేర్పబడుచుండెడిది. అనగా స్వధర్మమాచరించి, దానివలన అర్థమును సాధించి, ఈ యర్థమున కామ్యములను నిర్వర్తించి మోక్షము పొందవలసినదని సమన్వయము చేసెడివారు. ఈ విద్యాభ్యాసము అయిపోయి విద్యార్థులు వెడలిపోవునపుడు గురువు వారి నడవడిని ఇట్లు శాసించెడివాడు. 'సత్యమునే పలుకుడు. ధర్మములనే ఆచరింపుడు. జ్ఞాన సముపార్జన మాత్రము మఱవకుడు. వంశతంతువులను త్రెంపక వివాహము చేసికొనుడు. సత్యము, ధర్మము. లోకకుశలత, లోకకల్యాణము అను వానిని మఱవకుడు. మీతాత తండ్రులనుండి పరంపరగా వచ్చుచున్న కార్యములను, దేవకార్యములను మఱవకుడు.' ఈ విధమైన అనుశాసనముతో గురువులు శిష్యుల నాశీర్వదించి తమ గురుకులమునుండి విశాలమైన భగవంతుని విశ్వ గురుకులమునకు విద్యార్థులుగా పంపెడివారు.

ఇట్టి బోధనాపద్ధతులతో గూడిన గురుకులములలో స్త్రీలు గూడ విద్య నభ్యసించెడివారు. రామాయణ కాలమున వాల్మీకి, అగస్త్యుడు, భారత కాలమున కణ్వుడు, మొదలగువారి ఆశ్రమములలో స్త్రీలు విద్య నభ్యసించి జ్ఞానపారంగతులైనట్లు కొన్ని గ్రంథములవలన తెలియుచున్నది. వాల్మీకి మహర్షి పూర్వము రామాయణ కావ్య రచన దీక్షలో నున్నప్పుడు లవకుశులను అధ్యయనము చేయించుచున్నప్పుడును, మైత్రేయి అనునొక తపస్వి కన్య వాల్మీకి ఋష్యాశ్రమమున తనకు వేదాధ్యయము అనువుగాకపోవుటచే ఆయన ఆజ్ఞ చొప్పున అగస్త్యాశ్రమమునకు పోయి చదివినట్లు భవభూతి తన యుత్తరరామ చరితమున చిత్రించియున్నాడు. కణ్వాశ్రమమున శకుంతలయు, మరికొందఱు కన్యలును శుశ్రూషచేయుట భారతమున కాననగును. వేదకాలమున గార్గి, ఆత్రేయి, మైత్రేయి మొదలగు ప్రసిద్ధ స్త్రీలు, బ్రహ్మవిద్యా పారంగతులై విద్వత్పరిషత్తులలో పాల్గొనుచుండెడి వారు. అందు గార్గి అను నామె ఒక మహాపరిషత్తునకు బ్రహ్మస్థానము నలంకరించినది. బ్రహ్మస్థాన మనగా నేటి అధ్యక్షస్థానమువంటిది. బోధనా విషయములలో పురుషులకు కృషి, గోరక్ష మొదలగునవి నేర్పబడినట్లే స్త్రీలకు గృహ నిర్వహణము, చెట్లను పెంచుట, పుష్పాపచయము, మాలికాకరణము మొదలగు ఉత్తమ గృహిణీ ధర్మములు శాస్త్రాధ్యయనమునకన్న ముఖ్యముగా నేర్పబడుచుండెడివని ఆ యా కథలవల్ల మనకు తెలియును.

నాగరికత హెచ్చిన కొలదియు జనపదములు, పట్టణములు, మండలములు, రాష్ట్రములు, రాజ్యములు, సామ్రాజ్యములు నేర్పడినప్పటి మార్పులు చరిత్రకారులకు కొంత లభించినవి. అంతమాత్రమున వేదవాఙ్మయము బయలుదేరుటకు ముందు, ఇవన్నియు లేవని యర్థము కాదు. ఆర్యులు శాఖలుగా చీలినారనియు, అందొక శాఖ భారతదేశమునకు వలసవచ్చిరనియు చారిత్రికులు చెప్పిన కాలమునకు కొన్ని వందల సంవత్సరముల పూర్వమే పట్టణములు, రాజ్యములు, రాజ్యాంగము,

వర్తకము మొదలగు సంశములతో తులతూగుచు, సర్వతోముఖముగా అభివృద్ధిచెందిన నాగరికతను అనుభవించిన జాతులు భారతదేశమున నున్నవి ఈ విషయము సింధులోయలో, మొహంజోదారో, హరప్పా మొదలగు ప్రాంతములలో చేసిన పరిశోధనవలన స్పష్టమైనది. అయినను ఆర్యులు కావలెనని పట్టణముల పరిహరించి అరణ్యములలో గణములుగా నేర్పడి జీవితము గడపిరి. వారికి పట్టణములు కేవలము వాణిజ్యమునకు, రాజ్యాంగమునకు మాత్రమే కూడలి స్థానములుగా నుండెడివి. పట్టణములలో పనిమీద వచ్చిపోయెడి జనసంఖ్యయే హెచ్చు. పట్టణ నివాసము లేర్పఱచుకొని యుండుటవలన కృషి గోరక్షలు నశించి దేశ సౌభాగ్యము దెబ్బతినునను అభిప్రాయమును శ్రీకృష్ణు డుపన్యసించినట్లు భాగవతమున దశమ స్కంధమున నున్నది. అంతేగాక పట్టణ నివాసము ఆరోగ్యమునకు భంగకరమని వారు పట్టణములను పరిహరించిరి. "సర్వశరీర దోషాః భవంతి గ్రామేషు" అని భరద్వాజుడు నగరవాసులైన మహర్షులతో చెప్పి అరణ్యములకు పిలిపించినట్లు చరకుడు వ్రాసియున్నాడు. ఇట్టి కారణములవలన పట్టణములతోబాటు గ్రామవాసములును, అరణ్యవాసములును ఉండనే ఉన్నవి. పైన జెప్పిన గ్రామగురుకులములతోబాటు నగరములలో గూడ విద్యాభ్యాస మారంభమై రాజుల పోషణలో నడచుట సంభవించినది. ఇట్టి విధానమున పట్టణములలో గూడ గురుకులములు స్థాపింపబడినవి. కొన్ని గురుకులములకు పైన నొక మహాగురుకులముండెడిది, ఈ మహాగురుకులము నేటి విశ్వవిద్యాలయము వంటిది. ఇట్టి మహాగురుకులములలో తక్షశిల ప్రాచీనతమమైనది. ఇది భారత యుద్ధానంతరము స్థాపింపబడినట్లు తెలియును. జనమేజయుడు తక్షశిలకు పోయి ఉపాంసు దీక్షను నేర్చుకొనెను. తక్షశిలయందు ప్రత్యేకింపబడిన శాస్త్రములు, వానిలోని సూక్ష్మములు మొదలగు ఉన్నత విద్యలు నేర్పబడుచుండెడివి. ఇట్లు విశ్వవిద్యాలయములు బయలుదేరిన కాలమున గూడ కొందరు ఋషులు గ్రామములలో గురుకులములు నడవుచుండెడి

వారు. జనమేజయుడు తక్షశిలలో ఉపాంసు విద్య నేర్చుకాలమున ధౌమ్యుడు అరణ్యమున ఇద్దఱు ముగ్గురు శిష్యులతో మాత్రము గురుకులము నడుపుచుండెను. గ్రామ్య జీవితము కోరిన రాజులు కూడ తమ తమ రాజకుమారులను అరణ్యములలోని గ్రామ గురుకులములకు పంపి అచటి ప్రశాంత వాతావరణమున విద్యాభ్యాసము చేయించెడి వారు. ఎట్లయినను భారత కాలమునాటికి దాదాపు గురుకులము లన్నియు తక్షశిల కేంద్రముగా గల్గినవయి రాజపోషణను పొంది నిలిచినవి. అరణ్యముల లోను, గ్రామములలోను గల గురుకులములలో సంహితలు, బ్రాహ్మణములు, షడంగములు, కొంత కొంత ధనుర్విద్యయు మాత్రము బోధించెడి వారు నగరములలోని ఉన్నత విద్యాలయములలో పై విషయములే గాక, రాజనీతి, దండనీతి, అర్థశాస్త్రము, చతుర్విధ గణితము, ఆయుర్వేదము, శిల్పశాస్త్రము, గాంధర్వము మున్నగు వివిధ విద్యలను బోధించెడి వారు. ఈ ఉన్నత విద్యాలయములలోని విధానములలోనే చతుర్దశ విద్యలను విభాగ మేర్పడినది.

ఇక నగరములలోని విద్యాభ్యాస క్రమము ఇంచుక పరిశీలింతము బాలురకు ప్రాథమిక విద్య నేర్పుటకై చిన్నచిన్న పాఠశాలలున్నట్లు తెలియును. బాలురు కలముల చేబూని పాఠశాలకు పోవుచుండుట వర్ణింపబడి యున్నది. ప్రాథమిక విద్యలో మొదట లిపి, సంఖ్యామానము నేర్పుదురని కౌటిల్యుడు చెప్పియున్నాడు. ఇది అందరకు సమానముగ నేర్పబడు ప్రాథమిక విద్య. ఇది అయిన వెంటనే మాధ్యమిక పాఠశాలలో కొంతకాలము, వ్యాకరణము, కావ్యము బోధించిన వెనుక అభిమాన విద్యలను నేర్పుటకు ఉన్నత గురుకులమునకు విద్యార్థులను పంపెడివారు. అందఱును సంస్కృతము నేర్వవలెను. దానివలన రాజభాషలో పాండిత్యము వచ్చుటయేగాక వివిధ ప్రాకృతములలో మాట్లాడు వివిధ ప్రాంతములవారికి ఏకకంఠత యేర్పడును. ప్రాథమిక సంస్కృత వ్యాకరణముగా సిద్ధవ్యాకరణము బోధింపబడెడిది. అందు 49 అక్షర

ములు 18 విభాగములలో బోధించెడివారు. ఈపద్ధతి స్థాపించినవాడు మహేశ్వరదేవుడు. అటుపైని పాణిని సూత్రములు అష్టాధ్యాయిక్రమమున 8 మాసములలో వల్లెవేయించెడివారు. అటుపైని ధాతుపాఠముతో ఈ సామాన్యవ్యాకరణము సమాప్తమయ్యెడిది ఆ విద్యనభిమానించి అభ్య సించువారికి మఱి అయిదు సంవత్సరములు ప్రత్యేకముగ ప్రణాళిక యున్నది.

హేతువిద్య, న్యాయము, తర్కము కూడ ప్రాథమిక విద్యతో తప్పనిసరిగా కొంతకాలము అభ్యసింపవలసినది. ఈ విద్యాలయములు విద్యారంభమునకును, తక్షశిల మొదలగు ఉన్నత విద్యాలయములు విద్యాపరిసమాప్తికిని పనికి వచ్చెడివి విద్యాలయములలో చేరుటకు వచ్చినవారు "ఆచార్యభాగము" అనబడు వేతనమును సహస్ర నిష్క సంఖ్యగా మొట్టమొదటనే చెల్లించెడివారు. నిర్ధనులైనవారు 'శుశ్రూష కాంతేవాసులు' గా చేరెడివారు. వీరు పగలంతయు గురువునకు వలసిన పనులుచేయుచు రాత్రులందు విద్యనధ్యయనము చేసెడివారు వీరినే "ధర్మాంతేవాసు" లందురు ధనము చెల్లించిన వారిని "ఆచార్య భాగ ధేయకులు" అందురు ధర్మాంతేవాసులుగా చేరుట కిష్టపడనివారు మిగిలినవారివలెనే విద్యాభ్యాసము పూర్తియయిన వెనుక ధనము చెల్లింప వచ్చును. విద్యా పరిపూర్తి సమయమున రాజులను, ధనికులను యాచన చేసి గురుదక్షిణ సమర్పించిన వారు కౌత్సుని మొదలు దయానందుని కాలమువఱకు కనిపించుచున్నారు. పట్టణములలోని రాజకుటుంబముల వారును, పటిక్కిభామణులును, మరికొందరు ధనికులును విద్యార్థులకు ధనప్రదానము నేర్పాటు చేసెడివారు. ఒకప్పుడు కాశీవాసులు అగు ధని కులు బీదలకు అన్నదానము చేయించి చదువు చెప్పించిరని తిలముష్టి జాతకమువలన తెలియుచున్నది.

ఈ విద్యాలయములలో ఒక్కొక్క ఉపాధ్యాయుడు సుమారు 500 మంది విద్యార్థులకు పాఠములు చెప్పెడివాడు. ఆ విద్యార్థులలో

నున్నతవిద్య నేర్చుచున్నవారు క్రిందికక్ష్యలవారికి బోధనచేయవలయును. ఈ పద్ధతి వలన వారికి నేర్చిన విద్యయందు నిష్ఠ యేర్పడును. అట్టివారిని అనుశాస్త్రలందురు. ఇట్టి యనుశాస్త్రలలో వినయ విధేయతలు గలిగి విద్యాకుశలులై, సౌందర్యవంతులైనవారికి గురువులు పిల్ల నిచ్చుటగూడ గలదు. ఉన్నత విద్యాలయములలో ప్రత్యేక విద్యలు నేర్పెడివారు. ప్రాథమిక, మాధ్యమిక విద్యలు పూర్తియయి యున్నత విద్యాలయమున చేరుటకు వచ్చిన విద్యార్థులకు ప్రవేశపరీక్ష లుండును. ఈ ప్రవేశ పరీక్షలు ద్వారముల కడనే ఉండెడివి. అనగా సంభాషణ పద్ధతితో జరిపెడివారు. అందు నూటికి పదిమంది కన్న ఉత్తీర్ణులయ్యెడివారు కారు. అట్లు ఉత్తీర్ణులైనవారిని విద్యాలయమున జేర్చుకొని వారి వారి అభిమాన విద్యలలో ప్రవేశమిచ్చెడివారు. ఈ ఉన్నత విద్యాలయములు విద్యారంభమునకు గాక విద్యా పరిసమాప్తికి పనికివచ్చెడివి. ఈ యున్నత విద్యలలో శాస్త్రములు, దర్శనములు, కళలు అను విభాగము లుండెడివి. శాస్త్రములలో హస్తిసూత్రము, అశ్వహృదయము, శబ్దరావజ్ఞానము, మంత్రము, మృతకోత్థాపన విద్య, లుబ్ధక కర్మ (వేట), ధనుర్విద్య, అంగవిద్య, ఆలంబన క్రియ, చికిత్స అనునవి ముఖ్యములు. కళలలో వాచనము, లేఖనము, స్వర్ణకారక్రియ, సంఖ్యానము, జ్యోతిషము, జాతకము, స్వరవిద్య, అగద తంత్రము, విషామృతీకరణము, గానకళ మున్నగునవి ముఖ్యములు. క్షత్రియులకు అధర్వణములలోని అస్త్రవిద్య ప్రత్యేక శాఖగా నుండెడిది. మంత్రులు కాదలచిన బ్రాహ్మణులు కూడ ఈ విద్య నభ్యసించుచుండిరి. అఘోరము,వాయవ్యము, నారాయణము,ఆగ్నేయము, కృత్య మొదలగు విద్యలు సప్రయోగముగా బోధింపబడెడివి. ఈ ఉన్నత విద్యలందు గూడ లేఖనభాగము చాల తక్కువగా నుండెడిది. గ్రంథములకు ప్రతులు తీయుట యొకటియే లేఖనము. ఈ విద్యార్థులు తీసిన ప్రతులు దేశమున విద్యావ్యాప్తికి చాల తోడ్పడెడివి. చీనా యాత్రికుల పెక్కు వ్రాతపత్రాలను తమ దేశమునకు గొనిపోయినారు.

ఈ విద్యాలయములలో ఒక నిర్ణీతమగు దినచర్య యున్నది. వారు బ్రాహ్మ ముహూర్తమున లేవవలెను. కాలకృత్యము లన్నియు తీర్చుకొని ఉషస్సమయమునకు అధ్యయనమునకు సంసిద్ధులు కావలెను. మధ్యాహ్నమునకు పూర్వమే అధ్యయనము పరిసమాప్త మయ్యెడిది. అటుపైన భోజనము, అటుపిమ్మట వృత్తివిద్యలు నేర్పుట, విద్యాలయ ములకు ప్రసిద్ధులగు మహాత్ము లెవరైన వచ్చినప్పుడు అనధ్యయన మయ్యెడిది అట్లే పర్వాకనధ్యయనము, సూతికానధ్యయనము, అశౌచా నధ్యయనము మొదలగునవి ఉండెడివి. విద్యార్థులను బ్రాహ్మ్య ముహూ ర్తమున మేల్కొలుపుటకు ఒక కోడిని పెంచెడివారు. ఈ మర్యాదను బట్టియే కోడికి కాలజ్ఞపత్రము అను పేరు వచ్చినది. ఒకమా రొక విద్యాలయమున కోడి చనిపోగా, క్రొత్త కోడిని కొనితెచ్చిరి. అది రెండవ జాముననే కూసినది వెంటనే విద్యార్థులు లేచి స్నానములుచేసి యధ్యయన మారంభించి, అధ్యయన సమయమునకు నిద్రబోయిరి. ఆ యపరాధమునకు మఱునాడు ఆ కోడిని నఱికివైచిరి.

విద్యార్థులు చాల నిరాడంబర జీవితమున కలవాటుపడియుండెడి వారు. రాజకుమారులైనను, నిర్ధనులైనను, ఒకేవిధమైన దుస్తులు ధరించెడివారు. ఏకతాళ ఉపానీహములు, పర్ణచ్ఛత్రము, ధోవతి, ఉత్తరీయము వారి లక్షణములు. బీదవిద్యార్థులు వీధులలో బాఱవైచిన పీలికలను తెచ్చి కుట్టుకొని ధరించెడివారు. వారి ప్రతిదిన భోజనమున యవాగు, భట్టము ఇచ్చెడివారు. పర్వదినములలో గురువులతోబాటు వారందరును, ఇక్షు, గుడ, దధిక్షీరములతో భోజనములు చేసెడివారు.

ఈ ఉన్నత విద్యలో ఒక సంవత్సరము మొదలు పన్నెండు సంవత్సరములవరకు అభ్యాసముండెడిది. అటుపైన వారికి ఉపాధ్యాయ, మహోపాధ్యాయ, మొదలగు బిరుదము లొసంగెడివారు. షడ్దర్శనీపారగ పదవాక్య ప్రమాణ పారీణ మున్నగు బిరుదములకు మొదలు 12 సంవ త్సరముల వరకు శిక్షణ యుండెడిది. ఈ విద్య పూర్తియయిన విద్యార్థిని

స్నాతకు డందురు. అతడు వెంటనే బయలుదేరి దేశము పర్యటింప వలయు నను నియమము గలదు. ఇట్లు పర్యటించుచున్న కాలమున, వారనేక రాష్ట్రములలోని ప్రజలను, జాతులను, ఆచారములను, నాగరకతలను, వింతలను, విశేషములను, పరిశీలించి తాము నేర్చిన విద్యకు లోకజ్ఞానము జతపరచుకొనెడివారు. ఇట్లు పర్యటించుచున్న బ్రహ్మచారులను పిలిచి వారి సంప్రదాయములు, కులగోత్రములు తెలిసికొని ఆడుపిల్లల తలిదండ్రులు కన్యాదానము చేయుటతో వారు గృహస్థులయ్యెడివారు. ఈ యాచారములు నేటి వివాహములో స్నాతకము, కాశికిపోవుట, మొదలగు చిహ్నలుగా మిగిలిపోయినవి.

ఏది యెట్లున్నను పూర్వకాలమునుండి వచ్చుచున్న భారతీయ విద్యాభ్యాస క్రమమును అందలి బోధనాపద్ధతులను గమనించినచో కొన్ని ముఖ్యాంశములు మనకు కన్పించును. విద్యలో విజ్ఞానము, వినియోగము అనువానికి భేదము లేకుండుట మొదటి విషయము. దీనివలన ప్రతి బోధనపద్ధతులను జీవితమున కన్వయించునట్టిదై విద్యార్థిని కేవలము పండితునిగా చేయునదిగాక కార్యశూరునిగను, బ్రతికి బ్రతుకనిచ్చునది నేర్పుటయును అయి ఉండును. అల్పాల్పములగు నిదర్శనములతో మహావిషయములను స్పష్టపఱచుటవలన విద్యార్థి మనస్సు విజ్ఞానవంతమయ్యును, బాల్యములోని కోమలత్వమును పీడక యుండును పొలము దున్నుట, పశువుల మేపుట, తోటలను, దొడ్లను పెంచుట, మున్నగు శుశ్రూషలతో కూడియున్న యీ బోధనపద్ధతివలన విద్యార్థి కేవలము గ్రంథకీటకము గాక సంఘముయొక్క నిర్మాణ సౌభాగ్యమునకు పునాదియగుట సంభవించును. అన్నిటికంటె ముఖ్యమగు అంశము మరియొకటి యున్నది. గురువు ఏ స్వల్పకాలమో పాఠముచెప్పి మిగిలిన సమయములలో శిష్యులు వేరుగా నివసించుచుండినచో అది కేవలము వట్టి పాఠమేయగును. అట్లుగాక పూర్వ గురుకులములలో అన్నియును శిష్యులకు వసతి స్థానములే గనుక

గురుశిష్యులు నిరంతరము కలిసియుండినచో గురువుల నడవడిలోని సారాంశమంతయు శిష్యులకు నేర్పకయే యంటును. ఇట్టి సంబంధము శిష్యుని జీవితమునకు చక్కని స్వరూపము నేర్పఱచి చక్కదిద్దును. నేటికాలమున విద్యార్థులకు మార్గదర్శకులు కాదలచిన అధ్యాపకులెల్లరు ఈ బోధనాపద్ధతులను ఇతోధికముగా పరిశీలించి అవసరమైనవి గ్రహించినచో అభివృద్ధికి తోడ్పడవచ్చును. పురోభివృద్ధిని కోరువారికి వెనుక చూపుగూడ కొంత యవసరము. గతమునందు అనుభావము కరుడు గట్టియుండును. గతమంతయు చెడ్డదనిగాని, వర్తమానమంతయు విజ్ఞానమయమనిగాని తద్వ్యతిరేకమనిగాని నొక్కి చెప్పజాలము గదా! అట్టి సందర్భమున సమగ్ర పరిశీలనము, సర్వతోముఖాభివృద్ధి కెంతయు ఆవశ్యకము కాగలదు.

*

## ఉమర్ ఖయ్యామ్

డాక్టరు బూర్గుల
రామకృష్ణారావు

పాశ్చాత్యుల ప్రశంసకు పాత్రులైన పారసీకవులందరిలో 'ఉమర్ ఖయ్యామ్' కవి యగ్రగణ్యుడని చెప్పవలయును. ప్రాచ్య సారస్వత మునం దభిరుచిగల పాశ్చాత్యులలో ఉమర్ కవితా మధువును గ్రోలని వారును, 'టాగూరు' కావ్యామృతము నాస్వాదించనివారును మిగుల యరుదు. ఉమర్ ఖయ్యాము కావ్యమునకు పిట్జు జరాల్డు అను ఆంగ్లేయ కవి చక్కని యనువాదము చేసియున్నాడు. పారసీ భాష రాని ఆంగ్లేయ విద్యాధికులగు భారతీయులు పిట్జు జరాల్డుయొక్క అనువాదకావ్యమును తరుచు చవులూర జదివి యానందింతురు. ఆ కావ్యము ననుసరించి శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు రచించిన "మధు కలశము" నుండి చవిజూచినవారు ఉమర్ కవితయొక్క ప్రత్యేక సౌందర్యమును గొంత వరకు గమనించి యుండిరి.

ఉమర్ ఖయ్యాం కవి పారసీకదేశమునందలి ఖురాసాన్ ప్రాంత మున చేరియున్న 'నైషాపూర్' పట్టణమందు క్రీ. శ. 1015—1020 సంవత్సరముల మధ్యకాలమున జనించెననియు, క్రీ. శ. 1123 కు సరి యగు 517 హిజరీయందు శతాబ్దముకంటె నెక్కువ వయసున స్వర్గస్థు డయ్యెననియు దెలియుచున్నది. అతనిపేరు 'గియాసుద్దీన్ అబుల్ పతహ ఉమర్ బిన్ ఇబ్రాహీమ్ అల్ ఖయ్యామీ'. గియాసుద్దీన్ అను పూర్ణనామమునకు బదులు సంక్షిప్తనామము 'ఉమర్' అనుపేర నందఱచే పేర్కొనబడుట గనుచున్నాము. 'ఖయ్యామ్' అనుపదమునకు గుడార ములు నేయువాడని అర్థము. అనేక పారసీ కవులవలె ఈ విశేషణ

మాతని పూర్వులవృత్తిని సూచించుచున్నదని పలువురు విశ్వసించు చున్నారు ఆ దేశపు కవుల చరిత్రమును ఆకాల పరిస్థితులను గనుగొని నచో నీ విశ్వాసమునకు బలమైన యాధారములు గలవు. ఈ కవిజీవిత చరితమును, స్వరూపగుణ విశేషములను, కవితా సారస్యమును అనుభ వించి అందు ప్రతిఫలించిన వ్యక్తియొక్క ప్రతిబింబమును మనోదృష్టిచే జూచియే తెలిసికొనవలయునుగాని జీవితముయొక్క వివరములు దెల్పు చారిత్ర కాధారములగు గ్రంథములు పెక్కు లేవు. అయినను సమకాలికు లగు కొందఱి గ్రంథములవల్ల 'ఉమర్' చరిత్రము కొంత తెలియు చున్నది.

ఈ మహాకవి 'నైషాపురము' సందలి గొప్ప విద్వాంసుడును పండితుడు నగు 'ఇమామ్ మునఫఖద్దీన్' వలన విద్యల నభ్యసించి, తర్కము, వైద్యశాస్త్రము, తత్త్వశాస్త్రము, గణితము, జ్యోతిషము నందు గొప్ప పండితుడుగా బరిగణింపబడుచుండెను. ఇట్లు సకల శాస్త్ర వేత్త యయిన ఉమరునకు గణిత జ్యోతిషములపై నభిమానము మెండు. సమకాలికులచే గొప్ప దైవజ్ఞుడుగను, శాస్త్రవేత్తగను వర్ణింపబడి యున్నాడు 'ఉమర్' జీవితమునకు సమకాలికులగు ప్రముఖు లిద్దఱి జీవితములతో చాల సంబంధము గలిగియున్నట్లు తెలియుచున్నది. సల్జూఖీరాజవంశమునకు మూలపురుషుడగు తోగ్రల్ బేగ్ కుమారుడగు 'అలల్ అర్సలాన్' కును మనుమడు 'మలిక్ షాహా' కును వజీరుగా నుండిన 'నిజాముల్ ముల్కు తూసీ' 'నిజాముల్ ముల్కు' తన వసీయత్ (మరణశాసనము) నందు కొన్ని సంగతులు వ్రాసియున్నాడు. 'హకీం ఉమర్ ఖయ్యామ్' నిజాముల్ ముల్కునకు సహాధ్యాయుడట. 'ఇస్మాయీ' లను పక్షమునకు సర్దారుడై (Cold man of the mountains) అన భయంకరమైన బిరుదునొంది, ఆ కాలమునందా రాష్ట్రములలో హత్యల కును, దోపిడులకును, మత కలహములకును పెట్టినది పేరుగా నుండి ఆబాల్యమిత్రుడగు 'నిజాముల్ ముల్కు' ను గూడ దన కత్తి కె

గావించిన "హసన్ బిన్ సబాహ్" రెండవ సహాధ్యాయియట. ఈ ముగ్గురు సహాధ్యాయులలో ముందెవడు గొప్ప పదవి నలంకరించినను, దన మిత్రు లిద్దరితో నా పదవి యొక్క గౌరవ సౌభాగ్యములను బంచుకొన వలయునను నొడంబడిక జరిగినదట. 'నిజాముల్ ముల్కు' వజీరుగా నేర్పడినపిదప 'హసన్ బిన్ సబాహ్' కు ప్రాంతాధికార మిప్పించియు ఉద్యోగము గైకొనని 'ఉమర్' నకు తగిన రాజసన్మానమును, ఉపకార వేతనము నేర్పాటు చేయించియు, దన బాల్యపు టొడంబడికను నెరవేర్చెను.

'ఉమర్' గొప్ప వైద్యుడనియు రాజకుమారుడగు 'సంజార్' న కుపచార మొనర్చెననియు, రాజు మెప్పువడసెననియు దెలియుచున్నది. ప్లేటో యను తత్త్వ శిరోమణి 'None but he, who can geometrise can enter here' అని తన Academy (విద్యాపీఠము) ద్వారమున నిబంధన వ్రాయించి కొట్టియుండెనట. ఆ మహోక్తి ననుసరించి ఆకాలపు తత్త్వజ్ఞులందఱు గణితమును (తర్కమునకు మొదటిమెట్టగు క్షేత్ర గణితము) పిదప జ్యోతిషమును ముఖ్యముగా నభిమానించెడివారు. 'ఉమర్' గూడ నట్లే స్వయముగా జ్యోతిషముయొక్క ఫలభాగము నందు విశ్వాసము లేకున్నను సిద్ధాంతము, ఫలభాగము • రెంటియందు పాండిత్యము సంపాదించెను. 'మలిక్‌షా' కాలమున హిలాలీ శకమును సంస్కరించి, తప్పుల సవరించి 'హిలాలీ' జంత్రీని సరిచేసెను. అట్లే తరుచు రాజునకును, వజీరునకును ముహూర్త నిర్ణయము చేయుచు ప్రశ్నోత్తరముల వలనను, గొప్ప దైవజ్ఞుడుగా మెప్పువడసెనని 550వ హిజిరీలో 'ఉమర్' యొక్క శిష్యుడగు 'నిజామీ సమర్కందీ' తన 'చహార్ మికాలా' అను గ్రంథమున వర్ణించియున్నాడు. కవిగా పేర్కొన లేదు. అంతియే గాక స్వదేశమునందును కవుల ప్రశంసకుగాని, జనుల బహిరంగ సమాదరణకుగాని అతడు పాత్రుడు కాలేదు. ఆంగ్లేయ పండితుడగు ప్రొఫెసర్ బ్రౌన్ గూడ దన పారసీక వాఙ్మయ చరిత్రము

నందు 'ఉమర్' మూడవ తరగతి కవి యని వ్రాసియున్నాడు. ఇందుకు కారణములు మున్ముందు తేటపడగలవు

ఉమర్ గొప్ప తార్కికుడనియు, శాస్త్రవేత్తయనియు పైన నుడివి యున్నాము. చతుశ్శాస్త్రపాండితికిని (ముఖ్యముగా గణితమునకు) ఈ రసవత్కవితాధారకును సామంజస్యము గాని లేక బాంధవ్యము గాని యెట్లు కుదిరినదో చిత్రము. పండితాగ్రగణ్యుడగు ఉమర్ యొక్క తత్త్వజ్ఞాన సూత్రములు సదాచారులగు ఆ కాలపు ఇతర పండితులకు వెగటుగా దోచుటయేగాక అతని వర్తనముగూడ నిష్ఠుర నిరసనమునకు పాత్రమై యుండినదట. శాస్త్రాభ్యాసనమువలన గలిగిన శ్రమను బోగొట్టుకొనుటకోయన అపుడపు డాశువుగా జెప్పిన ఈ 'రుబాయ్యాత్' (గీతములు) శిష్యులుగాని మిత్రులుగాని ఏర్పరచిన ఇతర సభలందు చదువుచుండెడివారట. బహిరంగముగా మెచ్చదగినవి కావనియు ధర్మవిరుద్ధములగు సూత్రములను వెల్లడి చేయుచున్నవనియు బహిరంగ సభలనుండి ఉమర్ గీతములు బహిష్కరింపబడినను, ఎట్లులో నశింపక నిలిచియున్నవి. అసలు ఉమర్‌చే రచింపబడిన గీతములిన్నియని నిశ్చితముగా చెప్ప వీలులేదు. హిజ్రీ 865 నందు వ్రాయబడిన ప్రతి బాడ్లీన్ భాండాగారములో నున్నది. దానియందు 158 గీతములుమాత్రము గలవు. ఇండియా అఫీసునందు గల ప్రతియందు 326 ను, కలకత్తా Asiatic Society ప్రతియందు 516 ను, Camudye నందలి ప్రతి యందు 801 యు; హైదరాబాదు అసఫియా కుతుబ్‌ఖానా యందుగల వ్రాతప్రతియందు 299 గలవు. హిజరీ 1000 నందు వ్రాయబడిన ప్రతియందు 175, హిజరీ 1017 నందు వ్రాయబడిన హైదరాబాదు ప్రతియందు 299 యుండుట జూడ, పై యాధారములనుబట్టి విచారింప రానురాను గీతముల సంఖ్య హెచ్చినట్లు కనబడును. రమణీయములై యువకుల కానందదాయకములగు నీ గీతములు లోకప్రియత్వము నందినట్లును అనేకులు ఉమర్ యొక్క సూత్రాన్వయము సమర్థించుచును

వివరించుచును గీతముల వ్రాసి గురువునకు ఉమర్ పేరున కర్పించిరని తెల్లమగుచున్నది. క్రీ.శ. 1867 నందు ఫ్రెంచి రాయబారి J. B. Nicolas ప్రతుల నన్నిటిని పరిశీలించి భాషాంతర సహితముగా నొక ప్రతిని ప్రచురించెను. అందు 464 గీతములు గలవు. విన్‌ఫీల్డుగారు పరిశోధించి 'ఉమర్' యొక్క శైలినిబట్టి విమర్శించి 500 గీతములను నిజముగా 'ఖయ్యామ్' వని ప్రచురించియున్నారు. Miss Leadel వ్రాసిన ప్రకారము 'ఉమర్' వ్రాసినవని ప్రతీతిగల గీతముల సంఖ్య 1200. శైలిని, భావమును, భాషను బట్టి విమర్శించి లెక్కించినచో సుమారు 400 గీతములు నిజముగా 'ఖయ్యామ్' వై యుండునని తోచును. సుమారు నూటయేబది గీతములను, వందకంటె తక్కువ గీతములందు సమన్వయించి Fitzerald కవి యనువదించెను. రసవంతమగు నీ Fitzerald కావ్యమునే మాతృకగా గొని కాబోలు రాయప్రోలు సుబ్బారావుపంతులు గారు 'మధు కలశము'ను రచియించిరి.

'మధు కలశము' ను ఫారసీ గీతములతో బోల్చిచూచిన విశేషముగ భేదము గన్పడును. ఉమర్ కవి తార్కిక శక్తిని, మనోహరముగా లౌకిక పారలౌకిక జీవన సూత్రములపై ప్రయోగించుచు, ఆచార పరాయణులమనియు, ధార్మికజీవనము చేయువారమనియు విఱ్ఱవీగు 'జాహిద్'లపై దాడి వెడలును. 'ఖయ్యామ్' ఒనరించు ద్రాక్షాసవ స్తవము, ప్రేయసీ లాలనము, ఆచార నిష్ఠాగరిష్ఠుల నిరసనము, 'హాఫీజు' మున్నగు మహాకవుల రచనలవలె సరళము గాక కొంచెము పరుషముగా, నిష్ఠురముగా సత్య స్వరూప మజ్ఞాత మనియు, అజ్ఞేయ మనియు, జీవితము క్షణభంగురమనియు అందువల్లనే ఈ జీవిత ముండునంతకాలమున మధు సేవయు, ప్రేయసీ లాలనమును జేయుచు తన్మయత్వము నొంది పారలౌకిక చింతల మఱచిపొమ్మనియు హెచ్చరించును. ఈ సూత్రములనే యనేక ఉదాహరణముల నిచ్చుచు వివిధ హేతువాదపూరితమగు తర్కములచేతను, సమాధానములచేతను బలపఱచి యున్నాడు.

చార్వకీయ నైతిక తత్త్వముల బోలు ఈ సందేశములు Fitzerald కు నచ్చినను నచ్చకపోయినను A. C. Benson వ్రాసినప్రకారము వీటిని మాతృకగా గొని Fitzerald కవి తన యసాధారణమగు కవిత్వధారా శక్తిని వినియోగించి స్వతంత్ర కావ్య మనదగియుండి తన కళా నైపుణ్యమును చాటునట్టి అనువాదము నొనర్చెను. అట్లే రాయప్రోలు సుబ్బారావుపంతులుగారు 'ఖయ్యామ్' తో తన్మయత్వమునొంది మత భావ గాంభీర్యమును, ధారాశక్తిని, లలితపద గుంభనము వెల్లడిచేయు 'మధు కలశము' ను ఆంధ్ర సోదరులు రుచి చూచుటకై రచించుట సంతోషావహము. Fitzerald కావ్యమువల్ల ప్రసిద్ధిజెందిన 'ఖయ్యామ్' యొక్క కళ, తెనుగు కవియొక్క సహజసుందరమగు భాషయందు మరింత ప్రతిభావంత మగుచున్నది తిక్కన పోతనాదుల యాంధ్రీ కరణములవలె స్వతంత్ర కావ్యము లనదగియున్నవి. కాని 'ఉమర్' యొక్క భాషాంతరములు కేవలము తర్జుమాలు కావు. ఉదాహరణము నకు మొదటి పద్యమునే చూడుడు.

ఖుర్షీదు కమందె సుబ్హా బర్బాం అఫ్గంద్
కై ఖుసరవెరోజ్ బాద దర్జామ్ అవ్గంన్.

అను రెండుపాదములుగల మాతృకయందలి సూర్యోదయము నెట్లు వర్ణించిరో యనువాదకులు చూడుడు.

ఉ. లెమ్ము నిశాకమండలితలిన్ బడగా విసరెన్ బ్రభాతమం
దమ్ములు చిమ్ము దిఙ్మణిని తారకలావలబోయె గాంతి సూ
త్రమ్ముల యుచ్చులొడ్డెను సుతారపు తూరుపు వేటకాడు ర
మ్యమ్మగు పాదుషా కనక హర్మ్యశిఖా కలశాలి గట్టగన్.

సూర్యుడు గగనముపై ప్రభాతమను జాలమును వేసెనని మొదటి పాద మున కర్థము. రెండవ పాదమున ఆకాశమును మధుపాత్రమనియు, సూర్యకాంతులు మధువనియు నుత్ప్రేక్షగా అర్థమును సూచించినాడు. తెనుగు పద్యములతో పోల్చి తారతమ్యము గనుడు. ఇంకొక పద్యము.

చ. కడు నరుణమ్ముగా నెచట కన్నెగులాబి జ్వలించునచ్చటన్
బడదగు మున్ను సీజరు నృపాలుని రక్తమటంచు నెంతు
కడ జవుదోట తొయ్యలి సుగంధ సుమమ్ములు రాసిపోయు నా
కడనొక యప్సరస్సఖి నిగారపు వీడెమురాల యుండెడిన్.

పై పద్యముతో ఫారసీగీతములను బట్టి తెనిగించిన క్రింది పద్యమును పోల్చి చూడుడు.

చ. వనముల నెట్టనొ కుసుమ వారము కాంతులనీను చోటులన్
వెనుక నృపాలరక్తము భువిన్ బడిపేరెను మట్టిగాగ నె
మ్మనమున నీలనీరజము మాటున దాగిన క్రొత్తయాకునున్
గనుమది కామినీ రుచిర గండయుగిన్ గల పుట్టుమచ్చయే.

ఇట్లే మధుకలశములోని ప్రతి పద్యము నుదాహరించుచు తెలుగుకవి యాంగ్లేయ కవి ననుసరించి కాటోలు గావించిన మార్పుల జూపెట్ట వచ్చును. Fitzerald యొక్క అనువాదము కాని, మధుకలశము కాని కేవల భాషాంతరములుగాక మాతృకలోని భావములను అవసరమైనచో విస్తృతముగా లేక సంకుచితముగా మార్చి కళాపోషణకు దగిన తొడవుల దొడిగి మనోహరముగ వ్రాయబడి యున్నవి. రసవంతములగు కల్పనలను గావించి రమ్యములగు చిత్రములను దిద్ది తమ భాషకుం దగిన యలంకారములను దొడిగి 'ఉమర్' గీతములకు వన్నెపెట్టిరి. ఫారసీభాషయందు సహజమాధుర్యము గలిగియు ఉమర్ గీతము లాంధ్ర పద్యములంత లలితముగా నుండవు. ఆంధ్ర పద్యములందువలె ఉమర్ నైతిక సందేశములు ఫారసియందు అలంకారములను నాచ్ఛాదనములనుండి తొంగి చూచుటలేదు. విస్పష్టముగాను, నిస్సందేహముగాను ఎదుర్కొనును. ప్రతిభాషకు కొన్ని గుణములు దాని వారసత్వమునుబట్టి (పూర్వ చరిత్రమునుబట్టి) కలుగును. ఫారసీభాషయందు సూఫీ తెగకు సంబంధించిన భక్తులుగాని, సామాన్య కవులుగాని ఇస్లాం మతమునకు విరుద్ధమైనప్పటికిని, మధువును, పానపాత్రను పాత్రలం దిచ్చు

'సాకీ' మున్నగు విభావసామగ్రిని పరిత్యజించలేదు. భక్తి పూరితము లగు కావ్యములందును ద్రాక్షాసవమునకు మిక్కిలి గౌరవము గలదు. ఫారసీభాషయొక్కయు, జాతియొక్కయు, చారిత్రిక వారసత్వ పరిణామ మది.

పై కారణముల వల్ల ఉమర్ పేర్కొన్న మధువు కేవల ద్రాక్షా రసమో, లేక అంబుజోదర దివ్య పాదారవింద చింతనామృతమో, కామించిన ప్రేయసి కేవల చంచలాక్షియో లేక పరబ్రహ్మమో యను ప్రశ్న పలువురను బాధించినది. కొందరు చరిత్రమును బట్టి చూడ ఉమర్ సంతోష ప్రియుడనియు, భోగపరాయణుడనియు, తరుణీలంపటు డనియు దెలియుచున్నది కావున నతని గీతములు పాంచభౌతిక శరీర ధారిణియగు నొకానొక లతాతన్విని గూర్చిన పలవరింతలు గాని పార లౌకిక వాంఛలచే పీడింపబడిన భక్తుని ప్రణయ నివేదనములు కావని యభిప్రాయపడినారు. మరికొందఱు తత్త్వజ్ఞానియు సూఫియు నగు హకీం ఉమర్ ఖయ్యామ్ అతి కాంక్షతో వలచిన భోగము కేవల భక్తి పారవశ్య జనితానందాతిరేకమనియు, త్రావిన మధువు భగవత్పాదారవింద ధ్యానామృతమనియు, కామించిన పరాశక్తి సచ్చిదానంద స్వరూపమగు పరబ్రహ్మమే యనియు నిరూపించెదరు. నిజమేమో ఉమర్‌నకును, వాని దైవమునకే తెలియును. కాని ఇదమిత్థమని ఇతర సూఫీ కవుల తెగనుండి బహిష్కరించి, ఉమర్ యొక్క ప్రణయమును 'ఇష్క హకీకీ' (దైవభక్తి) నుండి 'ఇష్కె మజాజీ' (లౌకిక ప్రేమ) లోనికి దిగద్రొక్కుట కాధారములు గనబడవు. అనేక గీతములు ద్వ్యర్థి పరము లుగా నున్నను కొన్ని గీతములు దైవపరముగాక యర్థమే కావని సకల జనసమ్మతము. కొన్ని కేవల లైహికసంబంధములని కూడ చెప్పవచ్చును. కాని అంతమాత్రమున 'ఉమర్' ను పాశ్చాత్య పండితులవలె చార్వా కీయుడని గాని, ఎపిక్యూరియన్ అనిగాని తలంచుట గొప్ప పొరపాటు. శృంగార కవిత్వముయొక్క పరిభాష నుపయోగించుట సూఫీల సుప్రసిద్ధ

మైన యలవాటు. 'మౌలానా రూం'. 'జామీ', 'హాఫీజు' 'నర్మద్ నర్మస్తు' మున్నగు సూఫీమహాకవుల వాఙ్మయమునం దనేక గీతములందు ఉమర్ యొక్క భావములే స్పష్టముగా ధ్వనించును. ఆర్యుల వేదాంతతత్త్వముల నప్పటికే సూఫీలు కొంతవఱ కంగీకరించియుండిరి. క్రీ శ 923వ సం.ము మార్చి 13 తేదీన 'అనల్ హక్' (సోహం బ్రహ్మ) యని తపస్సుచేయు 'మన్‌సూర్ అల్ హల్లాజు' నకు ఉరిశిక్ష విధింపబడియుండెను. మన్ సూర్ యొక్క తత్త్వము సర్వసమ్మతము గాకున్నను సూఫీ తెగవారు మహమ్మదీయేతర సిద్ధాంతములగు సాంఖ్య సిద్ధాంతములను గ్రీకుల 'నియోప్లేటానిజం' యొక్క తత్త్వములను స్వీకరించిరి. సత్యస్వరూప మజ్ఞేయమనియు, సర్వాంతర్యామియగు శక్తినిర్గుణమనియు, జీవుడు కర్మ బద్ధుడనియు, జీవితము క్షణ భంగురమనియు, కావున ప్రేమయే (భక్తియే) ముక్తి సాధన మనియు సూఫీల యుపదేశము. వైరాగ్యమునుగూడ నొక సాధనముగా నంగీకరించినను జీవిత సామగ్రి నుపయోగించుకొన వలయుననియే వారి యభిప్రాయము. ఐహిక ప్రేమ దైవ భక్తికి మార్గదర్శకమని వారి మతము. అందువల్లనే స్త్రీ పురుషుల భేదము లేకుండ (అనగా ప్రేమింపబడిన వ్యక్తి, స్త్రీ యైనను గావచ్చును, పురుషుడైనను గావచ్చును) ప్రణయములోనికి దిగి శృంగారరస పరి ప్లుతములగు గీతములను వాడియున్నారు. అట్లే పారశీకుల పూర్వాఖ్యాన మగు మధుసేవయు కవుల కుత్ప్రేక్షాసామగ్రిగను, భక్తులకు పారవశ్య చిహ్నముగను ఉపకరించెను. సూఫీ కవులందఱ కీగుణములు సామాన్య మగునవియే. అట్లయిన, ఉమర్‌ను వారలనుండి ప్రత్యేకించు గుణము లెవ్వి ? ఉమర్ వ్రాసినంత నిష్ఠురముగాను, నిర్భయముగాను ఇతరులు వ్రాయలేరు. లోక వ్యవహారములను విమర్శించునెడగాని లేక శంకాతంక మనస్కుడగు జిజ్ఞాసువుయొక్క ఆత్మీయాందోళనమును వెలిబుచ్చు నెడ గాని తాను నిజమని పరిగ్రహించు తత్త్వముల నుపదేశించునెడ గాని 'ఉమర్' చూపెట్టు నిశ్చలబుద్ధియు, జంకు లేమియు, ఇతరుల

యందు గనము. అందువల్లనే శక్తిమంతముగను, పరిణామకరముగను ఆకర్షకముగను గన్పడును. అందువలననే ఎపిక్యూరియన్ అను పేరునకు బాత్రుడై యశమునో, అపయశమునో పొందుచున్నాడు. కాని తాత్త్వికముగా మిక్కిలి భేదములేదు.

(సారస్వత వ్యాస ముక్తావళినుండి)

## జాతీయోద్యమము - వాఙ్మయ ప్రభావము

శ్రీ దేవులపల్లి రామానుజరావు

నిద్రాణమైయున్న జాతిని మేలుకొలుపుటకు సాహిత్యముకన్న మహత్తరమైన సాధనము మరొక్కటిలేదు. ఒక దేశము యొక్క కష్ట సుఖములు, మంచిచెడ్డలు, ఒడుదుడుకులు ఆ వాఙ్మయములో ప్రతిబింబిం చుచుండును. ఒక జాతి చరిత్రను నిర్మించుటలో రచయితలకు గల ప్రభావము అమోఘమైనది. రూసో, వాల్టేరుల రచనలు ఫ్రెంచి విప్లవము నకు కారణభూతములైనవి.

టాల్‌స్టాయి, మాక్సింగోర్కి, డాస్టొవాస్కి ప్రభృతులు రష్యన్ వాఙ్మయము ద్వారా ఆ దేశీయులలో అద్భుతమైన ప్రబోధము కలుగజేసిరి. శ్రీకృష్ణదేవరాయల నిర్యాణానంతరము శత్రురాజొకడు విజయనగరము మీద దండెత్తివచ్చినప్పుడు అల్లసాని పెద్దన చెప్పిన పద్యము విని సిగ్గిల్లి ఆ రాజు తన సైన్యముతో పలాయనము చిత్తగించినాడట. ఖడ్గతిక్కన రణరంగమున వెన్నిచ్చి యింటికి మరలివచ్చినప్పుడు, ఆతని తల్లి మరియు భార్య చెప్పిన చాటుపద్యములు ఆతనిలో పరాక్రమము విజృం భింపజేసి యుద్ధభూమికి పంపినవట. ఇవన్నియు రచయితలకు, వాఙ్మయ మునకు, దేశచరిత్రలను దిద్ది తీర్చుటలో గల ప్రభావమునకు స్థాలీపులాక ముగా పేర్కొనబడిన నిదర్శనాలు మాత్రమే.

బ్రిటిషు పరిపాలన క్రింద అణగిపోయిన భారతీయులను, తమ విధ్యుక్త ధర్మములను పాలింపవలసినదని ప్రబోధించి, మేలుకొలిపినది వాఙ్మయమే యని చెప్పిన అతిశయోక్తికాజాలదు. ఒక యుద్యమము చక్కగా వ్యాప్తి చెందుటకు వాఙ్మయము మిక్కిలి శక్తిమంతమైన

సాధనమని భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర నిరూపించుచున్నది. ప్రబుద్ధ భారతమునకు తొలి వైతాళికులు రచయితలేనని చెప్పవచ్చును.

మన దేశీయులను మేలుకొలిపిన ప్రప్రథములలో స్వామి దయానంద సరస్వతి ముఖ్యుడు. ఆయన వ్రాసిన సత్యార్థప్రకాశిక బహుభాషలలోనికి పరివర్తింపబడి, అసంఖ్యాకులగు ప్రజల హృదయాలలో జాతీయ ఆత్మగౌరవ బీజములను చల్లి, వారిచేత దేశముయొక్క గొప్పతనమును గుర్తింపజేసినది. తమకొక ప్రత్యేక సంస్కృతి భాస్వంతమైన చరిత్ర కలదనియు, అందు కనుగుణముగా తమ భవిష్యత్తును నిర్మించుకోవలెననియు సత్యార్థ ప్రకాశిక ప్రబోధించినది. రాజా రామమోహనరాయిచే ప్రబోధితమైన వంగదేశమున ఈశ్వరచంద్ర విద్యాసాగర ప్రభృతులు దేశీయులలో తమ రచనలద్వారా చైతన్యమును కలుగజేసిరి.

తరువాత స్వామి వివేకానందుని రచనలు, ఉపన్యాసములు ఆసేతు హిమాచల ప్రదేశమున ఉద్బోధము, చైతన్యము కలుగజేసినవి. ముఖ్యముగా విదేశాలలో వివేకానందునివలన భారతదేశ వ్యక్తిత్వము ప్రపంచమునకు బోధపడినది. పాశ్చాత్య దేశాలలో భారతీయులు, అనాగరికులు, అడవి మనుష్యులు, అను అపోహలను వివేకానందుడు తొలగించెను. వంగదేశములో క్రమక్రమముగా వ్యాపించుచున్న క్రీస్తుమత ప్రచారమును అరికట్టుటకు మరొకవంకనుండి బ్రహ్మసమాజము ఉద్భవించినది శ్రీ రఘుపతి వెంకటరత్నము నాయుడు, వీరేశలింగము పంతులుగార్లద్వారా ఆంధ్రదేశముమీద బ్రహ్మసమాజ ప్రభావము ఎక్కువగా పడినదని చెప్పవచ్చును. కేశవ చంద్రసేనుని రచనలు వంగదేశమునందలి యువకులను ఊపి ఉత్సాహతరంగితులను జేసినవి. ఈ విధముగా దేశములో సంచలనము కలుగజేసి ప్రజలలో చైతన్యము వ్యాపింపచేయుటకై ఉద్యమములు క్రమక్రమముగా తలయెత్తినవి ఈ

యుద్యమాల ప్రచారము భారతదేశమునందలి వివిధ భాషలలో విరివిగా జరిగినది.

భారత రాజకీయాలలో డాక్టరు అనీబిసెంటు ప్రవేశము ఒక చారిత్రాత్మక ఘట్టము. ఆమె మన జాతీయోద్యమమునకు తొలిసారి విప్లవ దృక్పథము నిచ్చిన వీరనారీమణి. త్యాగశీల. హోం రూలు ఉద్యమముద్వారా శాసనోల్లంఘనముచేసి, చెఱసాల కరిగి, ప్రజలలో జెయిలు భయము తొలగించిన గౌరవము డాక్టరు అనీబిసెంటుకు చెందుచున్నది. భారతీయ సంస్కృతి, నాగరికతా విజ్ఞానములమీద ఆమెకు అత్యంత గౌరవము. భగవద్గీతను ఇంగ్లీషులోనికి అనువదించి, యువకులలో గీతా ప్రచారము గావించి, భారతీయులలో దేశాభిమానము ప్రచారము చేయుటకు ఆమె చేసిన సేవ అత్యంత ప్రశంసనీయమైనది. దివ్యజ్ఞాన సమాజ ఉద్యమముద్వారా, దివ్యజ్ఞాన సమాజ సంఘములు స్థాపించి ఉపన్యాసములతో భారతదేశమును ప్రబుద్ధము గావించినది డాక్టరు అనీబిసెంటు. విద్యాధికులు, విద్యార్థులు, యువకులు డాక్టరు అనీబిసెంటుకు అనుచరులుగా చేరిరి. శ్రీ సి. పి. రామస్వామి అయ్యరు, పండిత జవాహర్లాలు నెహ్రూగార్లు కొంతకాలము సంయుక్త కార్యదర్శులుగా పని చేసిరని ఇక్కడ ప్రస్తావించుట పేర్కొనదగిన విశేషము.

మరొక ప్రక్కనుండి మహారాష్ట్రములో వీర సావర్కరు విప్లవ ధ్వజమును ఎగురవేసి సోదర దేశీయులలో తన పుస్తకములద్వారా ప్రబోధము సాగించెను. మహారాష్ట్ర సామ్రాజ్యస్థాపన, ఉన్నతి, పతనములనుగూర్చి వివరించుచు, సావర్కరువ్రాసిన 'హిందూపద పాదుషాహి' గ్రంథము మహారాష్ట్రులలో స్వతంత్ర భావములను కలుగజేసెను.

1857 సంవత్సరములో మన దేశమున బ్రిటీషు పరిపాలన మీద ప్రకటింపబడిన స్వాతంత్ర్య యుద్ధమును, బ్రిటీషు ప్రభుత్వము కొందఱు విద్రోహుల సహాయముతో అణచివేసి దానిని ఒక తిరుగుబాటుగమాత్రమే

చిత్రించినది. వీర సావర్కారు ఈ 1857 విప్లవమును గూర్చి 'భారత స్వాతంత్ర్య సమర' మను ఒక ఉద్గ్రంథమును రచించెను. మహోజ్జ్వల మగు నీ గ్రంథమును బ్రిటీషు ప్రభుత్వము నిషేధించినను రహస్యముగా ఎందరో యువకులు దానిని పఠించి, సోదర దేశీయులలో స్వాతంత్ర్యో ద్యమ ప్రచారము చేసిరి. ఈ గ్రంధమును పఠించినారను నేరముమీద ఎందఱో యువకులు అరెస్టు అయినారు. "భారత స్వాతంత్ర్యసమరము" దేశీయుల రక్తమును ఉడుకెత్తించి స్వాతంత్ర్య కాంక్షలు చెలరేగజేసి నది. లోకమాన్య బాలగంగాధరతిలక్ మరాఠా, కేసరి పత్రికలలో సంపాదకీయాలద్వారా దేశములో ప్రబోధము సాగించెను. స్వాతంత్ర్య భావప్రపూర్ణములగు ఆ సంపాదకీయాలకు భీతిల్లి అయనను బ్రిటీషు ప్రభుత్వము నిర్బంధించినది. జెయిలును శ్రీకృష్ణస్థానమని భావించి తిలక్ మహాశయుడు తన నిర్బంధకాలమున గీతాభాష్యమును కర్మయోగ మను పేరుతో రచించెను. తిలక్ కర్మయోగమునకు భారతదేశములో విశాలవ్యాప్తి కలిగినది. కర్మయోగముద్వారా భారతీయులు తమ విధ్యుక్త ధర్మమును గుర్తించి, పరదేశ ప్రభుత్వ దాస్య బంధములను త్రెంచి వేయవలెననియు, శ్రీకృష్ణుని బోధలలోని రహస్య మిదియే యనియు బాలగంగాధరుడు ప్రబోధించెను. తిలక్ కర్మయోగము భారతదేశము లోని అన్ని భాషల యందు అనువదింపబడినది. "స్వాతంత్ర్యము నా జన్మహ"క్కని బాలగంగాధరుడు గర్జించెను. గోఖలే, దాదాభాయి నౌరోజి, రమేశ చంద్రదత్తులు ఆంగ్ల రచనల ద్వారా విద్యాధిక ప్రపంచమునకు బ్రిటిషు పరిపాలన వలని నష్టములను సకారణముగా నిరూపించి, స్వపరి పాలనావశ్యకతను రుజువుచేసిరి కాని వారి రచనలు ఆంగ్ల విద్యాధికు లకు మాత్రమే ఉపకరించినవి. ఇవి ఇతర భాషలలోనికి అనువదింప బడలేదు.

మహారాష్ట్ర దేశమున లోకమాన్య బాలగంగాధర తిలకుతో పాటు తన కలమును జాతీయోద్యమప్రచారమునకు వినియోగించిన విద్వాంసుడు

స్వాతంత్ర్య జ్యోతిని మారుమూలల పల్లెలలోనికి దీసికొనివెళ్లి ఇంటింట వెలిగించి చీకటిలోనున్న ప్రజాసామాన్యమునకు వెలుతురు చూపించి, భారతీయ జాతీయోద్యమమును నిజమైన ప్రజల ఉద్యమముగా జేసిన సంపూర్ణ గౌరవము గాంధీమహాత్మునికే చెందుచున్నది. గుజరాతీలో నవజీవన్, ఇంగ్లీషులో యంగు ఇండియా మున్నగు పత్రికలద్వారా గాంధీమహాత్ముడు ప్రజలలో జాతీయ భావాలను ప్రజ్వరిల్ల జేసెను. ఇంగ్లీషు భాషయందును, గుజరాతీ యందును గాంధీమహాత్ముని కలము అత్యంత శక్తివంతమైనది. పూవువలె మృదువే గాక, వజ్రమువలె కఠోరమైనదిగూడ ఆయన రచన. గాంధీమహాత్ముని వ్యాసములు ఆసేతు హిమాచలము ప్రజలను పులకాంకితగాత్రులను జేసి స్వాతంత్ర్య సమరములో వారు నడుముకట్టి ముందుకు దూకుటకు ఉపయోగపడినవి. క్విట్ ఇండియా సందర్భమునందును, అంతకుముందును ఆయన నిర్వహించిన వివిధ ఉద్యమాల సందర్భమునందును ఆయన వ్రాసిన వ్యాసములకు ప్రపంచ వాఙ్మయమున నత్యున్నత స్థానము గలదు. రస్కిన్, టాల్స్టాయిల రచనల ప్రభావము గాంధీమహాత్ముని జీవితముమీద ఎక్కువగా పడినదని చెప్పవచ్చును. మహాత్మునివలెనే జవాహర్లాలు కూడ రచనల ద్వారా భారతదేశమును ప్రబోధించెను.

ఈ సందర్భములో భారత స్వాతంత్ర్యోద్యమమునకు తోడ్పడిన విదేశీయుల రచనలను గూర్చి కూడ ప్రస్తావించుట అవసరము. సండర్లండు వ్రాసిన ఇండియా ఇన్ బాండేజి (దాస్యబంధాలలో చిక్కుకొనిన భారతదేశము), రామ్సే మాక్డొనాల్డు రచనలు మున్నగునవి భారతజాతీయోద్యమ ప్రచారమునకు బాగుగా తోడ్పడినవి. మనదేశములో అమృత బజారు పత్రిక, ప్రకాశం పంతులుగారి స్వరాజ్య, బొంబాయి క్రానికల్, చింతామణిగారి లీడర్, ట్రిబ్యూన్ మున్నగు పత్రికలు నిర్భయ విమర్శల ద్వారా దేశములో చైతన్యము, ప్రబోధము కలుగజేసినవి. భారతజాతీయోద్యమమును గూర్చి వ్రాసిన విదేశీయులలో బ్రెయిల్స్ఫర్డు గారికి

ఉన్నతస్థానము గలదు. భారతజాతీయ కాంగ్రెసు ఆశయాలను ధైర్యముతో తమ రచనల ద్వారా సమర్థించినవారిలో బ్రెయిల్సుఫర్డుగారు ముఖ్యులు.

1942 వ సంవత్సరమున గాంధీ, నెహ్రూ, పటేలు మున్నగు నాయకులు చెఱసాలలో బంధింపబడిన తరువాత భారత జాతీయోద్యమమును దౌర్జన్య పద్ధతులద్వారా అణచివేయుటకు బ్రిటీషు ప్రభుత్వము ప్రయత్నించిన సందర్భమున, సుప్రసిద్ధ పత్రికారచయిత లూయీఫిషర్ భారత జాతీయ కాంగ్రెసును గూర్చియు, మన జాతీయోద్యమమును గూర్చియు వ్రాసిన వ్యాసములు ప్రపంచమును దిగ్భ్రాంతమొనరించి భారతీయుల హక్కులు న్యాయమైనవని ప్రపంచమునకు రుజువుచేసినవి. భారత జాతీయోద్యమ చరిత్రలో లూయీఫిషర్ రచనలు చిరస్మరణీయములు.

వందే మాతరమ్ గేయము భారతీయులను ప్రబోధించుటలో చేసిన సేవను గూర్చి యెంత ప్రశంసించినను తక్కువే. బంకిం చంద్రుని జీవితకాలమున ఆయన నవలలు వంగదేశమును ప్రబోధించినవి. కాని తరువాత క్రమక్రమముగా జాతీయోద్యమ విస్తరణతో రాజకీయాలలో గాంధీమహాత్ముని అవతరణతో జాతీయోద్యమము దాల్చిన విప్లవ పరిణామముతో వందే మాతరమ్ గీతము సకల భారతీయుల హృదయాలను ఉత్సాహ తరంగితము చేసి, వారి నెత్తురును ఉడుకెత్తించి ఉత్తేజితులను గావించినది. ఈగీతము కొఱకు ప్రాణముల నైన నొడ్డుటకు యువకులు సంసిద్ధులైరి. వందేమాతరమనగా జాతీయోద్యమమునకు భారత స్వాతంత్ర్యజ్యోతికి పర్యాయపదమైనది. భారత దేశములో వందే మాతరమ్ వలె ప్రజల హృదయాలమీద ఆధిపత్యము వహించిన గేయము మరొక్కటి లేదనిన సత్యమునకు [illegible] వాటిల్లవు. రవీంద్రుడు శక్తిమంతమైన ఒక మహాసంస్థగా అవతరించి భారతీయులలో ప్రబోధము గావించెను. నేడు రవీంద్రుని 'జన గణ మన'

శ్రీ చింతామణి కేల్కార్. తిలకు తరువాత కేసరి పత్రికకు సంపాదకుడుగా పనిచేసి ఆయన మహారాష్ట్ర దేశములో జాగృతిని కలిగించెను. మహారాష్ట్ర భాషలో జాతీయోద్యమ వ్యాప్తికి తోడ్పడిన రచయితలలో శ్రీ సానే గురూజీ ప్రముఖులు. ఈయన తన రచనలలో ప్రాచీన సంస్కృతిని, పురాణములను, భారతీయ సాంఘికపద్ధతులను సామ్యవాద సూత్రములతో సమన్వయించినాడు. మామావరేర్కార్ తన లేఖినిద్వారా మన విద్యాధికులు క్రైస్తవ మిషనరీలవలె దేశాభ్యుదయమునకై జీవితాలను అంకితము చేయవలెననియు, ధర్మాదాయములను జాతీయము చేయవలెననియు ప్రబోధించెను. ఈయన రచనలలో హాస్యము, చమత్కారము ఉట్టిపడుచుండును.

మహారాష్ట్ర దేశములో ఖాండేకర్, హిందీలో ప్రేమచందువలె, తెలుగులో శ్రీ చింతా దీక్షితులుగారు చిన్న కథల ద్వారా జాతీయోద్యమ ఘట్టములను చక్కగా చిత్రించిరి. నారాయణ సీతారాం ఫడ్కే సుప్రసిద్ధ నవలా రచయిత. సమకాలిక సమస్యలు ఈయన నవలలకు ఇతివృత్తములు. తిలక్ కాలము నందలి రాజకీయములను ప్రవాసి యను నవల యందు, 1942 విప్లవమును ఝంఝామారుతము అను నవల యందు ఫడ్కేగారు చక్కగా వివరించిరి. చీకటి బజారును, ప్రజాహిత జీవనములోని అవినీతిని నిర్దాక్షిణ్యముగా ఈయన తన రచనలలో ప్రకటించి సంఘమునకు దారి చూపినాడు. ఇటీవల ఈయన కాశ్మీరు సమస్యనుగూర్చి కూడ ఒక చక్కని నవలను వ్రాసినాడు.

మహారాష్ట్ర దేశములో గాంధీ రాజకీయములను, గాంధీ వాఙ్మయమును వ్యాప్తిలోనికి దెచ్చిన పండితులు, రచయితలు ఆచార్య వినోబా భావే, కాకా కలేల్కారుగార్లు ఆచార్య అత్రే సంఘములోని చాదస్తముల నన్నింటిని తూర్పారబట్టిన విమర్శకుడు. హాస్యమునకు ఆటపట్టులగు ఈయన రచనలు మహారాష్ట్ర దేశమున మంచి ప్రబోధము కలిగించినవి.

మహారాష్ట్ర జాతీయ కవులలో గోవింద అగ్రజీ, తాంబే గారలు ప్రముఖులు.

హిందీ భాషలో జాతీయోద్యమ ఘట్టములకు వాఙ్మయములో స్థాన మొసంగిన కథకులు మున్షీ ప్రేమచందు, సుదర్శన్‌గార్లు. మున్షీ ప్రేమ చందు కథలు అన్ని భాషలలోనికి ముఖ్యముగా తెలుగు భాషలోనికి చాలవరకు పరివర్తింపబడినవి. బెంగాలు కాటకమునుగూర్చి శ్రీ సుదర్శన్ వ్రాసిన అన్నదాత యను గ్రంథము సుప్రసిద్ధమైనది. హిందీ జాతీయ కవులలో శ్రీ మైథిలీ శరణగుప్త, మహాదేవీవర్మ గార్లు ముఖ్యులు. క్షితీంద్ర మోహనసేన్, దేవేంద్ర సత్యార్థిగార్లు హిందీ భాషలో జాతీయ వాఙ్మయమును బహుళముగా సృష్టించిరి భారత రాజ్యాంగ పరిషత్తు సభ్యులు శ్రీ బాలకృష్ణ శర్మగారు హిందీ భాషలో మంచి రచయితలు. ఆధునిక హిందీ రచయితలలో రాహుల్ సాంకృత్యాయన్ ప్రముఖులు. ఈయన రచనల యందు విప్లవ దృక్పథము ప్రముఖముగా నుండును. "వాల్గానుండి గంగాతీరము వఱకు" అను రాహుల్ సాంకృత్యాయన్ గ్రంథము సుప్రసిద్ధమయినది.

కర్ణాటక సాహిత్యములో గూడ ఇట్టి పరిణామము మనకు కని పించుచున్నది. ఆలూరి వెంకటరావుగారు గాంధీ రాజకీయాలకన్న ముందే కర్ణాటక దేశములో దేశభక్తిని ప్రబోధించు రచనలు గావించిరి. కర్ణాటక భాషలో శ్రీకృష్ణ శర్మగారు జాతీయ సమస్యలను ప్రజలకు విప్పిచెప్పు రచనలను విరివిగా చేసినారు. అంబికాతనయదత్తు, మన శ్రీశ్రీ వలె, కర్ణాటక భాషలో విప్లవధ్వజమెత్తిన రచయితలు. భారతరాజ్యాంగ పరిష త్సభ్యులు మరియు కేంద్రప్రభుత్వ ఉపమంత్రి శ్రీ దివాకర్‌గారు కర్ణాటక భాషలో గాంధీ రాజకీయాలకు, గాంధీ వాఙ్మయమునకు చక్కని సమీక్ష వ్రాసిరి. వీరిని మనము శ్రీ ముట్నూరి కృష్ణారావుగారితో పోల్చవచ్చును. ఆచార్య గోకాక్ జాతీయ వాఙ్మయ సమీక్షకులలో ఎన్నతగినవారు. రాజ రత్నం, పుట్టప్పగార్లు ఉత్తేజకరమయిన జాతీయ గేయములను రచించిరి.

భారత జాతీయ గేయముగా నంగీకరింపబడినది. వంగభాషలో శరచ్చంద్ర ప్రభృతులు తమ రచనల ద్వారా సోదర దేశీయులను ప్రబోధించిరి. మహర్షి అరవిందునకు రవీంద్రునితో సమానమైన స్థానము వంగదేశమున గలదు. గాంధీమహాత్ముడు రాజకీయరంగమున ప్రాధాన్యము వహించకముందే ఆయన గీతోపన్యాసములు వంగదేశమును ఉత్తేజిత మొనరించినవి. ఆ దినాలలోని వంగదేశమునందలి విప్లవోద్యమ నాయకులందరును అరవిందుని గీతోపన్యాసములను విని ప్రబోధితులై భారతమాతసేవకు జీవితములను అంకితము చేయుటకు నిశ్చయించి ముందుకు వచ్చినవారే యని చెప్పవచ్చును. ఇంగ్లీషులో శ్రీ కె. యస్. వెంకటరమణి మున్నగువారు రచించిన గ్రంథములు విద్యాధికులను, విద్యార్థులను ప్రబోధితులను జేసినవి వెంకటరమణిగారి గ్రంథములు తెలుగులోనికి గూడ పరివర్తింపబడినవి.

తెలుగుదేశమున వాఙ్మయముద్వారా ప్రజలను మేలుకొల్పిన వైతాళికుడు శ్రీ వీరేశలింగం పంతులు వీరేశలింగం పంతులుగారు తమ రచనలద్వారా సంఘములోని కుళ్ళును బయటపెట్టి సంస్కరణోద్యమమును మాటలతో ప్రచారముచేసి సంతృప్తి చెందక ఆచరణలోనికి తెచ్చిరి. వీరేశలింగముగారిది సంస్కరణ దృక్పథము. రాజకీయముగా వీరేశలింగముగారు ప్రజాప్రబోధము చేయకపోయినప్పటికి వారి సంఘసంస్కరణోద్యమము ఆంధ్రుల కన్నులు తెఱపించి జాతీయోద్యమవ్యాప్తికి ఆంధ్రదేశములో మంచి అవకాశము కలుగజేసినది. ఆంధ్రపత్రికను స్థాపించిన స్వర్గీయ దేశోద్ధారక-విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్రదేశమున రాజకీయ చైతన్యమును కలుగజేయుటకు అద్వితీయమైన కృషిచేసిరి. ఆంధ్రుల ఏకైక దినపత్రికగా ఆంధ్రపత్రిక స్వాతంత్ర్యోద్యమ బీజాలను ప్రజాహృదయక్షేత్రాలలో చల్లి చిరస్మరణీయమగు సేవ గావించినది. ఆంధ్ర దేశములో రాజకీయ ప్రబోధము గావించిన పత్రికలలో కృష్ణాపత్రికది అగ్రతాంబూలము.

ఒకమారు శ్రీ ముట్నూరు కృష్ణారావుగారు తమ పత్రికలో యెక్కువ వార్తల ప్రకటన జరుగుట లేదను ఆరోపణకు ప్రత్యుత్తరమిచ్చుచు కృష్ణాపత్రిక వార్తాపత్రిక కాదనియు, అది అభిప్రాయాల పత్రిక యనియు తెలిపిరి. భారత జాతీయకాంగ్రెసు ఆదర్శాలనుగూర్చి,కాంగ్రెసు అధ్యక్షోప న్యాసాలనుగూర్చి జాతీయ భావప్రబోధకములగు కృష్ణాపత్రిక సంపాద కీయములు ఆంధ్ర దేశములో అపూర్వమగు సంచలనము గలుగజేసినవి. మారు మూలలనున్న ప్రజలు కృష్ణాపత్రిక సంపాదకీయములను చదివి రాజకీయముగా చైతన్యవంతులైరి. నాయకులను, విద్యాధికులను, ప్రజా సామాన్యమును అందరినీ ఒక్కుమ్మడిగా ఊపి ఉత్సాహ తరంగితులను జేసినవి కృష్ణాపత్రిక సంపాదకీయాలు. రాధాకృష్ణునివంటి వేదాంత వేత్తలే గాక పల్లెటూరి ప్రజానీకమునుగూడ కృష్ణా సంపాదకీయాలు ఉత్తేజితు లను గావించినవి. నాయకులు, కార్యకర్తలు సామాన్యప్రజలు ఆ పత్రికా సంపాదకీయాలను చదివి ప్రబోధితులగుచుండెడివారు.

ఆంధ్ర, కృష్ణాపత్రికల ననుసరించి యితర పత్రికలుగూడ బయలుదేరి ఆంధ్రదేశ రాజకీయ వాతావరణమును సజీవముగా జేసినవి. యువకులు భావగేయములద్వారా ప్రజానీకమును మాతృదేశ సేవకయి ముందుకు వచ్చునట్లు చేసినారు గురజాడ, రాయప్రోలు కవీంద్రులు ఇట్టి యువకులకు మార్గదర్శకులయిరి. దువ్వూరి, విశ్వనాధ, జాషువా, తుమ్మల కవీశ్వరుల రచనలు ఆంధ్రదేశములో దేశభక్తి, త్యాగదీక్షను ప్రబోధించినవి. శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణగారు కృష్ణాపత్రికలో తమ గేయములద్వారా సత్యాగ్రహోద్యమ ప్రబోధమును చేసిరి. 'మా కొద్దీ తెల్లదొరతనము', 'అంటరానివా రెవరోకాదు మావెంట రానివారె', 'దండాలు దండాలు భారతమాత' అను గేయాలు అపారమైన చైత న్యము కలుగజేసినవి. ఆధునికాంధ్ర కవిశేఖరుల రచనలలోని 'చావ లేదు, చావలేదు, ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్ర', 'దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్', 'వీరగంధము తెచ్చినారము,

వీరులెవ్వరో చెప్పుడీ', 'కొల్లాయి గట్టితె నేమి మాగాంధి కోమటయి పుట్టితే నేమి' అను గేయభాగాలు ఆంధ్రప్రజల నాలుకలమీద నాట్యము చేసినవి. 'భరతఖండము చక్కని పాడియావు' వంటి పద్యములు ప్రజా సామాన్యములో బ్రిటీషు పరిపాలనా స్వరూపమును బాగుగా చిత్రించినవి. రాయప్రోలు, గురజాడ, విశ్వనాథ, జాషువా, తుమ్మల, దువ్వూరి మున్నగు ఆధునిక కవిశేఖరుల రచనలు బహిరంగసభలలో వేదికలమీద శ్రావ్యముగా పఠింపబడి ప్రజలను చైతన్యవంతులుగా జేసినవి. సభలలో దేశభక్తి ప్రబోధకములగు గేయాలు, పద్యాలు అద్భుతమైన జాగృతిని కలుగజేసినవి.

ఈ జాతీయోద్యమ వాఙ్మయ ప్రభావ ఫలితముగా తెలుగులో వీర కావ్యములుగూడ బయలుదేరి పరదేశపాలనా బంధములను త్రెంచుకొనుటకై ప్రబోధము చేసినవి. ఆధునిక కవులలో శ్రీ శివశంకరశాస్త్రి, శ్రీ అడివి బాపిరాజు, శ్రీ కొడాలి ఆంజనేయులు మున్నగువారు త్యాగ సమయములందు ముందుకు వచ్చి చెఱసాలల నలంకరించిరి. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి' అను నవల ప్రజలలో చాల ప్రచారము చేసినది.

*

## తెలంగాణా జానపద సాహిత్య సంపద

శ్రీ బి. రామరాజు,
M. A. Ph. D.

పల్లె పాటలు వినోదముతోపాటు విజ్ఞానమునకును ఆలంబనములు. అర్థములేని వనుకొన్న పాటలం దత్యద్భుతములైన శాస్త్ర విషయము లంతర్గర్భితముగా నుండుటే దీనికి గారణము. వేదాదులను అనుశ్రుత ముగా నభ్యసించి కాపాడుకొనినట్లే ఆయుర్వేద, వాస్తు, జ్యోతిష, మంత్ర శాస్త్రములను కూడ మన పూర్వులు పల్లెపాటల పేటికలలో భద్రపఱచి నారు. గ్రంథస్థములైన విషయములు కేవలము విద్వాంసులకే తెలియును. కాని పాటల రూపమున నున్నచో పామర జనులకు గూడ తెలియునని కాబోలు జనోపయోగ విషయము లెన్నియో పిల్లల పాటలలో పొందు పఱచబడినవి. ఔత్తరాహుల జానపద వాఙ్మయమున వైదిక కర్మాచరణ విధానము గూడ నున్నట్లు వింటిని. ఒకానొక గ్రామమున బ్రాహ్మణ స్త్రీలు పాటలు పాడుచు వివాహాది కార్యములు చేయింతురట. పెండ్లికి జరుపవలసిన తంతు ఆ పాటల రూపమున వారి నోటికెక్కినది. ఒకప్పు డుత్తర దేశమున తురకల దండయాత్రల ఫలితముగా కొన్ని కొన్ని గ్రామములు బ్రాహ్మణ పురుష శూన్యములై పోయెనట. అప్పట్టున బ్రాహ్మణ స్త్రీలే వారి మాతృభాషలందు (బహుశః పురాణోక్తముగా జరుగవలసిన చోటులందు) వివాహాది శుభకార్యములు శ్రాద్ధక్రియలు జరిపించిరట. ఆ పాటలే ఇప్పటికిని ఆ నోట నానోటబడి బ్రదికియున్న వట. ఈ విషయము కన్నులార గాంచిన ఒక పండితుడు చెప్పి నా కాశ్చర్యము గలిగించెను. తెలంగాణమం దన్ని మండలము లందును కొన్ని కొన్ని ప్రదేశములు, గ్రామములు ఆదినుండియు పండితులకు,

కవులకు, సంస్కారులకు తావలములైనవి గలవు. మంథెన, చెన్నూరు ప్రాంతములు వేద పండితులకు, కోరుట్ల, సిరిసిల్ల, ధర్మపురి, మాను కోట, పాలమూరు వేదాంత తర్కశాస్త్రజ్ఞులకు, షాహాపురము, ఇల్లెంద గాయకులకు, పెద్దపల్లి నాట్య శాస్త్రజ్ఞులకు, సందిళ్ళ వీథి భాగవతులకు, ఓరుగల్లుప్రాంతములు సాహిత్యకులకు, కవులకు కల్వకుర్తి, అచ్చంపేట, నాగర కర్నూలు ఆయుర్వేద వాస్తు జ్యోతిష శాస్త్రవేత్తలకును వెనుకటి నుండి ప్రసిద్ధికెక్కినవి. ఇప్పటికినీ అయా ప్రాంతములందు ప్రాత ఘట ములు కొన్ని నిల్చియున్నవి. సేకరింప నోపికగలవారికి ప్రాంతములలో తాళపత్ర గ్రంథముల గుట్టలగుపడును. ఈ పనికి ప్రభుత్వమో, సారస్వత సంస్థలో పూనుకొనవలయును. అచ్చంపేట, తెల్కపల్లి ప్రాంతముల స్త్రీలు గృహ వాస్తు జ్యోతిష శాస్త్ర విషయ గర్భితములగు పాటలు పాడెదరట. ఈ విషయము లాయా ప్రాంతీయుల నోట విన్నప్పు డవి కాలగర్భమున గలసిపోకముందే యుద్ధరించుటకు పెద్ద లెవ్వరును పూనుకొనరే యనెడు తహతహపడుట దక్క అసహాయుడనగు ఒంటి మానిసిని చేయదగిన దేదియును లేదు. ఇక ప్రస్తుతము పల్లె పాటలలో నున్న కొన్ని ఆయుర్వేద విషయములు తెలుపుటయే నా యీ వ్యాస ముఖ్యోద్దేశ్యము.

ఆడుపిల్ల లిద్దఱు పరస్పర మొకరి కుడి యెడమ చేతులతో నింకొకరి యెడమ కుడి చేతులు పట్టుకొని ఇరువురి కాళ్ళొకకడ జేర్చి ఒకరి కొక రెదురుపడి, భూమి సరళరేఖగా 45 డిగ్రీలు వెనుకకు వంగి తమ చేతులపట్లూతగా నిల్చి గిరగిర తిరిగెదరు దీనినే 'బిత్తి' తిరుగుట యందురు. ఇది కన్యలకు చక్కని వ్యాయామము. ఇది ప్రస్తుతము 'స్కిప్పింగు' అను దానికి తావిచ్చినట్లున్నది. దేశదౌర్భాగ్యము. బిత్తి తిరుగుచు పాడెడు పాటలెన్నియోగలవు. వానిలో నొకటి.

ఒప్పుల కుప్పా - ఒయ్యారి భామా
మినపా పప్పూ - మెంతీ పిండీ

తాటీబెల్లం - తవ్వెడు నెయ్యీ
గుప్పెడు తింటే - కులుకూలాడీ
నడుమూగట్టీ - నామాట బట్టీ

ఈ పాటలో స్త్రీల కుపయుక్తమగు 'చిట్కా' యున్నది. ఇటువంటిదే పురుషులకొఱకు—

ఒప్పులకుప్పా - ఒయ్యారి భామా
సన్నాబియ్యం - చాయాపప్పూ
(మినపాపప్పూ - మెరికాబియ్యం)
పాలు నెయ్యీడి - పాశంవండూ
నీమొగుడు దింటే - ఆనందమంటే

ఈ రెండు పాటలును స్త్రీ పురుషులకు వేర్వేరుగా జెప్పబడిన వాజీకరణ యోగములు. వీనికనుకూలించు చరక సంహితా సూత్రములు, ఔషధ వివరములు గోలకొండ పత్రికలో ప్రకటింపబడినవి. నేను సేకరించిన మఱికొన్ని పాటలను వివరించెదను

కాళ్ళగజ్జె - కంకాలమ్మ
వేగుచుక్క - వెలగమొగ్గ
మొగ్గకాదు - మోదుగనీరు
నీరుకాదు - నిమ్మలవాయ
వాయకాదు - వాయంటకూర
కూరగాదు - గుమ్మడిపండు
పండుగాదు - పాపడమీసం
మీసంకాదు - మిరియాలపోతు
పోతుకాదు - బొమ్మలశెట్టి
శెట్టికాదు - శామలమన్ను
మన్నుకాదు - మంచిగంధపుచెక్క
లింగులిటుకు - పందెమాలపటుకు
కాలుపంపినట్లు - కడకుదీసిపెట్టు.

ఇదికూడ పిల్లల ఆటపాటయి. దీనిల పిల్లలకు జానువులపై బలపడి ల్పుతో లేచి చాల బాధపెట్టు గజ్జికి మందున్నది. ఈ గజ్జిపుండప్పు డప్పుడు మానుచు పొక్కుచు నీరుకారుచు పిల్లలను వారికన్న నెక్కువగా తలిదండ్రులను బాధపెట్టును. ఈ పాటలోనున్న కొన్నిపదముల కర్థము సాధారణముగా నెవ్వరికిని తెలియదు. తెలంగాణము పల్లెపట్టులందు తెలుగు, తెనుగు, బోయవారను నొకజాతివా రున్నారు. గ్రామరక్షణము, వేట, తేనెనమ్ముట, మూలికలపెంచుట వారివృత్తి. ఔషధములకు కావలసిన మూలికలను, వస్తువులను గ్రామీణాయుర్వేద వైద్యులకు వారే తెచ్చిపెట్టుదురు. ఆదిమాంధ్రశబ్దమును రాజకీయవేత్తలు హరిజనులకు వాడుచున్నారు. పొరపాటేమో, నిజముగా నాదిమాంధ్రులీ తెలుగువారని నా యభిప్రాయము. వీరినడిగిన కంకాలమ్మ, వేగుచుక్క, వెలగమొగ్గ వంటి శబ్దముల కర్థము చెప్పెదరు ఈ పాటకు రెండుమూడు పాఠాంతరములున్నవి. ఏ పాఠమైనను మొదటి మూడు వస్తువులను మాత్రము తప్పక పేర్కొనును అవి ముఖ్య ద్రవ్యములు. ఆ తరువాతివన్నియు ప్రత్యామ్నాయములే. కంకాలమ్మ=కచూరాలు. వేగులచుక్క (సరియయిన రూపము)=బావంచాలు వెలగమొగ్గ=పాదరసము. ఈ మూడును ముఖ్య వస్తువులు. ఇందులో పాదరసమునకు మాఱుగా నెన్నియో ప్రత్యామ్నాయములను సూచించినాడు మొగ్గకాదు-మోదుగనీరనగా పాదరసమునకు బదులు మోదుగచెట్టునుండి తీయు నీరును వాడవచ్చునని యర్థము. (ఈ నీరు తీయు పద్ధతి ఆయుర్వేద రసాయన భాగమునకు చెందినది). ఆ నీరు లభింపకున్నచో నిమ్మలవాయ=నిమ్మపులుసు వాడవచ్చును. అది కానిచో వావింటరసము, నీరుడుగింజల తైలము, మోదుగమాడ, మిరియములు, మఱ్ఱిచిగుళ్ళు, లోహరజము, మంచిగంధపుచెక్కవంటి క్రమముగా సూచింపబడిన వస్తువులలో నేదేని యొక వస్తువు నుపయోగించుకొనవచ్చును. పై వస్తువులను శరీరప్రకృతి ననుసరించి వాడవలయును. నిమ్మపులుసు, వావింటరసము, మిరియములు మున్నగునవి

శోధన ద్రవ్యములు. మంటమండకుండుటకై మంచిగంధపుచెక్కవంటి చల్లని వస్తువులను చెప్పినాడు. ఈ మూడు వస్తువులను బాగుగ మర్దన చేయవలయును. లింగులిటుకనునది మర్దనకు ధ్వన్యనుకరణము. పటు కనగా కాఠిన్యము ఏ మాత్రము లేకుండ పందెము వేసినట్లు మెత్తగా నూరవలెనని యర్థము. అట్టి యౌషధములను కాలునకు పుండుపై కట్ట వలెను. నయమైన తరువాత నా కట్టును "కడకు తీసిపెట్టవచ్చును." ఈ యోగమునకు సోమరాజి (బావంచాలు), శశికలయని పేరు. ఇంకొకపాట.

"చెమ్మచెక్క - చేరెడేసిబుక్క
అట్లుపోయంగ - ఆరగించంగ
రత్నాల చెమ్మచెక్క - రంగు వేయంగ
పగడాల చెమ్మచెక్క - పందిరేయంగ
పందిట్ల బాలుడు - పరుగులెత్తంగ"

ఈ పాటలో వయస్సువచ్చినను సమర్తకానివారికి (మాచకమ్మలకు) సంతానము కలుగనివారికిని 'చిట్కా' యున్నది. చెమ్మచెక్కను చెమ్మ చెక్కగా చదువుకొనవలెను. చెమ్మయొక్క చెక్క బుక్కవలెనట. చేరెడనగా చేతికి వచ్చునంత కాదు. ఆయుర్వేదమున చుళుకము, బిడాల పదకమను పరిమాణము గలదు, అంగుష్ఠము, అనామికము, మాధ్య మికము ఈ మూడు వ్రేళ్ళతో నెత్తెడు పరిమాణమే బిడాలపదకము. దీనినే అరచేత నిముడునంత పదార్థము లేదా చేరెడందురు. రత్నాలచెమ్మ యనగా నెఱ్ఱపూలు పూయు చెమ్మ. ముత్యాలచెమ్మ యనగా తెల్లపూలు పూయు చెమ్మ. మొదటిది రజస్వల కానివారికి రెండవది సంతానము లేని వారికి చెప్పబడినది. ఈ పాటను జానపద సాహిత్యమున సాంకేతికవాద మునకు(Symbolism) ఉదాహరణముగా దీసికొనవలెను. 'రంగువేయంగ' అనునది రజస్వలకును, 'ముగ్గువేయంగ' అభివృద్ధి, సంతానాభివృద్ధికిని సంకేతముగా గ్రహింపవలెను. సంతానము గలిగినతరువాత పగడాలు = ఊయల, పందిరి = ఉయ్యేలపై గట్టెడు పాలవెల్లి కావలసినదేగదా.

"పందిట్లబాలుడు – పరుగులెత్తంగ" గలిగెడు ఆనందము అనుభవైక వేద్యము. ఈ పాట నిద్దఱుబాలికలు (కన్యకలుకూడ) ఒకచో నభిముఖులై యుండి వారివారి కుడివైపులకు దూకుచు మరల నొకచో కలియుచు చేతులు తట్టుచు పాడెదరు. ఈ యాటనే చెమ్మచెక్క యందురు.

ఇంకొక పాటలో (Accidental) ఆగంతుకమగు భగ్నాస్థి చికిత్స సూచింపబడినది. ఇదికూడ పిల్లలపాటయే.

"కొండ మీద వెండి గిన్నె
కొక్కిరాజు కాలువిరిగె
దానికేం మందు ?
వేపాకుచేదు - వెల్లుల్లిగడ్డ
నూనమ్మబొడ్డు - నూటొక్కధార"

ఈ పాట సాధారణముగా కచ్చకాయ (గచ్చకాయ) లాటలో పాడెదరు. కచ్చకాయలాడెడు సమయమున (ఒక్కొక్కప్పుడు గుండ్రని రాళ్ళతో గూడ నాడుటచేత) వ్రేళ్ళు బెణికియో, మరెందువలననో ఎముకలు విరిగెడు అపాయముండునని కాపచ్చు, వెంటనే చికిత్సకై పాటలో మందును సూచించినారు. పాటలోమాత్రము కొక్కిరాజుకు కాలువిరిగి నట్లున్నది. ఎట్లున్ననేమి ? భగ్నాస్థి చికిత్సమాత్రము నిశ్చయము. వేపాకుచేదు, కుమ్ములో నుడికించిన వెల్లుల్లిగడ్డ (భగ్నాస్థి సంధానకరో రసోనః). నిమ్మబొడ్డు (నూ+నిమ్మబొడ్డు)=దానిమ్మబొడ్డును కలియ నూరి భగ్నాస్థిపై కట్టి నూటొక్క కుండ నీరు పోయవలెను.

పైపాటలన్నింటికిని పాఠాంతరములున్నవి కాళ్ళగజ్జిపాటలో పాదరసమునకు ప్రత్యామ్నాయముగా చెప్పబడిన వస్తువులపట్టిక కొన్ని పాటలలో పొడవుగానున్నవి. కాని ముఖ్యసూత్రముమాత్రము అన్ని పాటలలో నొక్కటే. ఈ పాటలకు కేవలము సూచన మాత్రముగా నర్థము చెప్పనైనది. ఏయే వస్తువు నెంతెంత పరిమాణముతో వాడ వలయునో వివరముగా వ్రాసిన నీ వ్యాసము ఆయుర్వేద గ్రంథమగును.

ఇటువంటివే పిల్లలపాట లెన్నియో యున్నవి. వానియం దద్భుతములగు విషయములు గుప్తముగా చెప్పబడినవి. ఉదాహరణకు "గుడుగుడు గుంచం" "కొంగ కొంగ గోళ్లు" మొదలయినవి. మొదటిదానిలో తేలు పాము కాటులకు చికిత్స యున్నది. రెండవదానిలో కునఖ చికిత్స (జెష్ట, గోరుచుట్టు) కలదు. ఇదంతయు బాలసాహిత్యమే.

ఇక పెద్దవారు పాడెడు పాటలలోనున్న విషయముల కొన్నింటిని ఉజ్మాత్రముగా సూచింతును. మానుకోట తాలూకా గుర్తూరు గ్రామములో నేను సేకరించిన ఒక తత్త్వములో పాముకాటునకు చికిత్స యున్నది. కనుక మొదటి రెండు చరణములే యుట్టంకింతును.

"చావదూర ఈపాము - చప్పీడి దెబ్బలాకు. చా.
భావించి వైరాగ్యామానే - బడితే దెబ్బ బడితేగాని. చా.
మాచికోయ రసము - బీసారి వేరూ దెచ్చి
కాచీ పోసినగాని - కావార మణగాదు." చా.

మాచికాయ, బీసరివేరు రసములను కాచిపోసినచో పాము విషము విరుగునట. ఎంత సులభసాధ్యములైన వీ యోషధులు!

1952 జనవరిలో మా గ్రామమున (మడికొండ) 'వేసంగి' వరినాటు వేయించుచుంటిని. అప్పుడు మా "తెగమాదిగ" వాని యింటిది పాడిన దొక 'నాగన్నపదము' వ్రాసికొంటిని. అది దీర్ఘగేయము. ఇచ్చట మాత్ర మవసరమైన భాగమునే యుదాహరింతును. పాటయందున్న విషయమది. ఒక చెల్లెలు తన అన్నగారికి 'దూపకు' తీసికొనిపోయి తిరిగి వచ్చుచుండగా మధ్యేమార్గమున నాగుబాము 'కలె గొటికినది' ఆ బాధతో నామె యింటికి చేరుకొనునప్పటికే విషము దేహమంతట వ్యాపించి పోయినది. పొలముకడనున్న యన్నగారి కీవార్త చేరినది. ఆతడు వచ్చి—

"తూరుపుబోయినీ - తుమ్మేరు దెచ్చి గొబ్బిల్ల, గొబ్బిల్ల
పడమట బోయినీ - పాలేరు దెచ్చి ,,

దచ్చినంబు బోయినీ - దంతేరు దెచ్చి గొబ్బిల్ల, గొబ్బిల్ల
ఆ యేరు ఈయేరు - కాల్వొడ్డిన గడిగి ,,
కాల్వొడ్డున గడిగినీ - కలరోటవేసీ ,,
కలరోటవేసినీ - రోకండ్ల గ్రుమ్మి ,,
రోకండ్ల గ్రుమ్మినీ - బట్టల్లబెట్టీ ,,
బట్టల్ల బెట్టినీ - గన్నెల్లపిండీ ,,
పిడుకల్లు గొట్టినీ - తంపుల్లుబెట్టీ ,,
తుకతుక ఉడికించి - మీగడల గలిపి ,,
పట్టిపట్టి పోయంగ - పానాలె పాయె. ,,

తుమ్మ, పాల, దంతెవేరుల రస ముడికించి మీగడతో కలిపి త్రాగించిన పాము విషము విరుగునని ఈ పాటలోని భావము. ఆలస్యమైనందున కావచ్చు పాటమాత్రము విషాదాంతముగా ముగిసినది. నాగుబాము ఒక్కకాటువేసి ఊరకుండదాయెను. 'కలెగొఱికిన' దట పాపము. ఐనను సకాలమున నీ చికిత్స చేసినచో లాభించెడిదేమో!

రావులమ్మ, రాములమ్మ పేరుతో నొక దీర్ఘగేయము పిచ్చుకుంట్ల వారు పాడుచుండగా విని వ్రాసికొంటిని. రామాయణమున సీతాపహరణము, శ్రీరామ విరహము, సీతచెఱ, రావణసంహారము, అగ్నిప్రవేశ మున్నట్లే రాములమ్మ పాటలో నొక లంబాడివాడు రాములమ్మ యను నొక కాపు గేస్తురాలిని మోసగించి ఎత్తుకొని పోవుటయు, రాములమ్మ భర్త మున్నగువారు పలుబాములంది చివరకు లంబాడివాని జంపుటయు, రాములమ్మ అగ్నిప్రవేశమును గలవు. కాని రామాయణమునకును, రాములమ్మ పాటకును నించుకంతభేదము చివర విషయమున నున్నది. అగ్నిప్రవేశ మొనర్చిన సీత దేవత గనుక బ్రదికినది. రాములమ్మ మాత్రము కాలిపోయి దేవతయయినది. బహుశః ఈ ఘటన నల్లగొండ మండలమున జరిగి యుండును. ఆ మండలమున రాములమ్మ, రాములయ్య యను పేళ్ళెక్కువగా పెట్టుకొనుటయే నా యూహ కాధారము.

(ఈ కథలో లంబాడివాడు రాములమ్మను మోసగించుపట్ల మచ్చు మందులును, ఆమెకు కడుపునొప్పి నయము చేయుపట్ల శూలకై చికిత్స యును కలవు. ఉదాహరించినకొలది వ్యాసము పెరిగిపోవునను భయముతో ముగించుచున్నాను.)

ఇటు లెన్నియో శాస్త్ర విషయములు పూర్వుల యనుభవములు మన పల్లెపాటలలో నిమిడి యున్నవి. భారతీయ విజ్ఞాన మిట్టి వింత రూపములతో తరతరములనుండి మన కందించుచున్న పూర్వుల బుద్ధి వైభవమును పొగడినచో కొంద అప్రాచ్యదృక్కులకు నచ్చదు. ఈ పాటలు వారికి మోటుగా నగుపడును. వాస్తు, జ్యోతిష విషయములున్న పాటలు సేకరించిన బాగుండును. అచ్చంపేట ప్రాంతీయులును, సారస్వతాభిమానులును ఈ పనికి పూనుకొనిన శ్రేయోదాయకము.

★

# భారతీయ భాషలు - హిందీ

శ్రీ మోటూరి సత్యనారాయణ

భారతదేశంలో ప్రస్తుతం పంచవార్షిక ప్రణాళికా వాతావరణం ఎక్కడ చూచినా కనిపిస్తున్నది. మొదటి ప్రణాళిక బాగా అమలుజరుగడం వలన రెండవ ప్రణాళిక కూడ రూపొందించబడింది. స్వరాజ్యం లభించిన తరువాత ఈ పది సంవత్సరాలలో భారతదేశం సాధించిన ఘనవిజయాలనూ, అభివృద్ధినీ చూచి ప్రపంచమే ఆశ్చర్యచకిత మవుతున్నది.

ఇంగ్లీషువారు భారతదేశాన్ని భయంకరమైన పరిస్థితులలో వదలి వెళ్లిపోయినారు, కూడు గుడ్డ లభించక కొన్ని ప్రాంతాలలో ఆ రోజులలో అనేకమంది మృత్యుదేవతకు బలి అయిపోయినారు. కడచిన పది సంవత్సరాలుగా మనం చేసిన కృషి ఫలితంగా ఈనాడు ఆహార సమస్య పరిష్కార మయింది. ఇక గుడ్డ సమస్య పరిష్కారం కావలసి యున్నది. అదిగూడ దాదాపు పరిష్కార మయినట్లేనని యెంచవచ్చును. అన్న వస్త్రాలకుగాను భారతదేశం ఏవరినీ యాచించవలసిన అవసరంలేదని నిస్సంశయంగా చెప్పవచ్చును. గుడ్డల విషయంలో కొద్ది రోజులలోనే భారతదేశం స్వయంపోషకం కావడమేకాకుండా ఇతర దేశాలకు కూడ ఎగుమతి చేయగలదు.

మొదటి పంచవర్ష ప్రణాళిక లక్ష్యం కూడుగుడ్డల సమస్యలను పరిష్కరించడంగా ఉండేది. రెండవ ప్రణాళిక ద్వారా యంత్ర సామగ్రిని పెంపొందించి దేశంయొక్క ఐశ్వర్యాన్ని వృద్ధిపొందించడానికి ప్రయత్నం ప్రారంభ మయింది.

యంత్ర సామగ్రిని వృద్ధిచేయడానికి ఆధారభూతములైన వస్తువులు ముందుగా ఈదేశంలో తయారుచేయబడగలవు. ఉక్కు, సిమెంటు, కాగితము మొదలగునవి ఈ దేశంలో తయారై కొద్ది సంవత్సరాలలో

మన దేశం స్వయంపోషకం కాగలదు. యంత్రాలు కేంద్రీకృతంగానూ, వికేంద్రీకృతంగాను గూడా ఉండగలవు. యంత్ర పరిశ్రమలను పెద్ద యెత్తున సాగించడానికి విశేషజ్ఞులు ఎంత అవసరమో చదువుకొన్నవారు గూడ అంతే అవసరము ఇంగ్లీషువారు భారతదేశాన్ని దరిద్రస్థితిలో సర్వకాలం అట్టే పెట్టడానికి ప్రజలను అశిక్షితులుగా అట్టేపెట్టినారు. విధి లేక కొంతమందిని శిక్షితులను చేశారు. అది అయినా ఇంగ్లీషుద్వారానే. ఇంగ్లీషు మాధ్యమం ద్వారా భారతీయులను సుశిక్షితులను చేయడానికి ఇంగ్లీషువారు విశ్వప్రయత్నం చేశారు. ఇంగ్లీషు విద్యా వ్యాప్తికి ఇంగ్లీషు ప్రభుత్వం కోట్లకొలది రూపాయలను ఖర్చుపెట్టింది వారికి అందులో రెండురకాల ప్రయోజనా లుండేవి. ఇంగ్లీషు భాషా ప్రచారంద్వారా భారతీయ సంస్కృతిని, ఆలోచనావిధానాలనూ ప్రభావితం చేయడానికి ప్రయత్నించడమే గాక. చదువుకొన్నవారిని క్రీస్తుమతంవైపుకు ఆకర్షించడానికి కూడా యత్నం జరిగింది. కడచిన 150 సంవత్సరాలలో లక్షలాది జనులు తమ తమ మతాన్ని వదలి క్రీస్తు మతాన్ని స్వీకరించారు. ఇంగ్లీషుభాష ప్రభావం మనమీద ఎంతగా పడిందంటే ఈనాడు మన ఇంగ్లీషు పండితులు ఇంగ్లీషువారు వెళ్లిపోయినా ఇంగ్లీషును వదలడానికి సిద్ధంగా లేరు. వారికి తమ భాషలయెడ హేయభావమూ, ఇంగ్లీషు భాషయెడ వ్యామోహమూ ఉన్నట్లు కనిపిస్తున్నది.

స్వరాజ్యం లభించిన తరువాత మనదేశంలో విశ్వవిద్యాలయాల సంఖ్య వాగా పెరిగింది. ప్రస్తుతం మన దేశంలో 33 విశ్వవిద్యాలయా లున్నవి. వానిలో ఈనాటికీ బోధనాభాష ఇంగ్లీషే. మహాత్ముడు స్వభాష, స్వదేశీ, స్వరాజ్యము అనే మూడు మంత్రాలను ఉపదేశించాడు. ఈ మూడు మంత్రాలను ఆధారం చేసుకొని జనశక్తిని జాగృతంచేసి మనలను స్వతంత్రులను చేశాడు. రాజకీయంగా మనకు సంపూర్ణ స్వాతంత్ర్యం లభించింది. వస్తువుల ఉత్పాదన దృష్టితో చూస్తే మన స్వదేశీ ఉద్యమం కూడ సఫలమయినట్లే. కాని స్వభాష

విషయంలో మన సందేహాలు దూరమైనట్లు కనిపించడంలేదు. ఇదివరలో స్వరాజ్య సమరంలో యోధులుగా పనిచేసినవారే ఇప్పటికీ రాజ్యాంగ యంత్రాన్ని నడిపిస్తున్నారు. వారందరూ, ఇంగ్లీషులో—ఇంగ్లీషు విశ్వ విద్యాలయాలలోనూ— కొంతమంది ఇంగ్లీషు దేశంలోనూ సుశిక్షితులైనవారు. తమ జీవితంలో ఒక సాధనగా ఉపయోగించిన ఇంగ్లీషును తొందరగా వారు వదలివేయలేకపోతున్నారు. స్వభాష ఉన్నతికి రాకపోవడానికి అది ఒక్కటేకారణంగా కనబడుతున్నది. వారు సంపాదించి యిచ్చిపోయిన స్వాతంత్ర్యాన్ని దేశభాషల ద్వారా శిక్షితులైనవారు నిల బెట్టుకొనగలరని గూడ వారికి విశ్వాసం కలగడంలేదు. చైనా, రష్యా. జపాన్ వంటి దేశాలవలె భారతదేశం గూడ భాషా విషయంలో స్వతంత్రంగా ఉండి అభివృద్ధిని సాధించగలదని వారికి ఎందుకు విశ్వాసం కలగడంలేదో అర్థంకావడంలేదు.

కోట్లకొలది రూపాయలు ఖర్చుపెట్టినా, నిరక్షరాస్యతా నిర్మూలనంలో భారతదేశం చాలా వెనకబడిఉన్నది. అమెరికా, రష్యా. మొదలగు దేశాలలో పరిశ్రమలు అభివృద్ధిలో ఉండడానికి అక్కడి ప్రజలు సుశిక్షితులై ఉండడమే కారణమని అందరూ అంగీకరిస్తున్నారు.

యంత్ర యుగంలో, యంత్రగతి రోజురోజుకూ మారిపోతున్న రోజులలో, సంపదను అభివృద్ధిచేయడం కఠినమైనపనికాదు. కార్ఖానాలను స్థాపించి దేశ సంపదను వృద్ధిచేయడానికి మనం ప్రయత్నం చేస్తూనేఉన్నాము. మన రెండవ ప్రణాళిక కూడ పూర్తి అయ్యేనాటికి ప్రపంచంలోని ఇతరదేశాలతో సమానస్థాయికి మనం తప్పక రాగలము. ఈ పనికి విశేషజ్ఞులూ, తెలివిగల కార్మికులూ అవసరం.

విప్లవాత్మకమయిన పనుల నెన్నిటినో భారతదేశం ఇంతవరకు చేసింది. రాష్ట్ర పునర్నిర్మాణం ఒక మహా విప్లవాత్మకమైనపని. ఒకప్పుడు మన దేశంలో 600 రాష్ట్రాలుండేవి. మన నాయకులు ఆ సంఖ్యను తగ్గించి 26 చేశారు. తగినంత విచారణ జరిపిన తరువాత మనదేశ నాయకులు

ఆ సంఖ్యను ఇంకా తగ్గించవలెనని ప్రయత్నించారు. భాషను ఆధారంగా చేసుకొని రాష్ట్రనిర్మాణం చేయవలెనని అనుకున్నారు. ఈనాడు భారత దేశం 14 రాజ్యాలుగా విభక్తమయింది. కేంద్రప్రభుత్వంవారి అజమాయిషీలో ఈ 14 రాష్ట్రాలూ ఎంతగానో అభివృద్ధిని సాధించగలవు. ఈ 14 రాష్ట్రాలలో ఉత్తర ప్రదేశము, బీహారు, మధ్యప్రదేశము, రాజస్థానము, పంజాబు ఈ అయిదు రాష్ట్రాలు హిందీ రాష్ట్రాలు. పంజాబులో పంజాబీ భాషకూడా ఉంటుంది. కాని అది హిందీకి చాలా దగ్గరగా ఉంటుంది. తెలుగు, తమిళము, కన్నడము, బెంగాలీ, ఒరియా, మళయాళము, అసామీ భాషలకు వేరువేరు రాష్ట్రాలు లభించినవి. బొంబాయి ద్విభాషా రాష్ట్రం. ఆ రాష్ట్రంలో మరాఠీ, గుజరాతీ భాషలు రెండూ అమలులో ఉంటవి. బొంబాయి రాష్ట్రం మనకొక గీటురాయిగా నిర్మించబడింది. కొద్ది రోజులలో బొంబాయి కూడ రెండుగా విభజనగాక తప్పదు. మన రాష్ట్ర నిర్మాణం భాషా ప్రాతిపదిక మీదనే ఏర్పడిందిగదా ! ఈ రాష్ట్రాలలో రాజ్య వ్యవహారాలు ప్రాదేశిక భాషలలో జరిగితీరాలి. మన ప్రతినిధులు ఆయా శాసనసభలలో వారివారి భాషలలో మాట్లాడడమూ, ఆయా ప్రాంతీయ భాషలలో రాజ్యాంగ వ్యవహారాలు జరగడమూ ప్రారంభమయితే ఇక ఇంగ్లీషుకు స్థానమేముంటుంది? మన రాష్ట్రనిర్మాణోద్యమం స్వభాష ఉన్నతికి తోడ్పడే ఉద్యమమని తెలుస్తూనేఉన్నది.

చాలామంది మద్రాసు, బెంగాలు ఈ రెండు రాష్ట్రాలు ఇంగ్లీషు భాషకు పెట్టని కోటలని భ్రమపడుతున్నారు. భారతదేశంలో ఇంగ్లీషు తెలిసినవారు చాలామంది ఉన్నారని కూడ వారి యభిప్రాయం. 1951 వ సంవత్సరములో తయారు చేయబడిన జనాభా లెక్కలనుబట్టి చూస్తే మనదేశంలో చదువుకొన్నవారి సంఖ్య 5 కోట్ల 92 లక్షలు అని తేలుతున్నది. వారిలో ఇంగ్లీషు చదువుకున్నవారు 37 లక్షల 96 వేలుమాత్రమే. అంటే చదువుకొన్నవారిలో నూటికి 6 గురుమాత్రమే ఇంగ్లీషు తెలిసినవారు. మొత్తం జనాభాను పట్టి చూస్తే ఇంగ్లీషు తెలిసిన

వారు నూటికి ఒక్కరుమాత్రమే. మొత్తం జనాభాలో అక్షరాస్యులు నూటికి 16 గురు మాత్రమే.

ఈ దేశములో ఇంగ్లీషు తెలిసిన వారున్నారంటే దానికి ఇంగ్లీషు వారు కారణంగాని ఇంగ్లీషుకాదు. ప్రస్తుతం ఇంగ్లీషువారు వెళ్ళిపోయి నారు. ఇంగ్లీషుయెడల మనకుగల వ్యామోహంకూడా తగ్గిపోతున్నది. మద్రాసు, కలకత్తాలలాంటి పట్టణాలలో ఇంగ్లీషు ఉపన్యాసాలు చాలా వరకు తగ్గిపోయినవి.

మనదేశంలో వైజ్ఞానికోన్నతికి ఇంగ్లీషు అవసరమని చాలా మంది పెద్దలు వాదిస్తున్నారు. విజ్ఞాన శాస్త్రవేత్తలు మనదేశంలో ప్రస్తుతం ఎంతమంది ఉన్నారు ? ఒక లక్షమంది ఉండవచ్చును. ఒకలక్ష మందిని పదిలక్షలమందిగా మార్చవలెనంటే స్వభాషలను సాధనాలుగా స్వీకరించడం చాలా అవసరం. కొంతమంది ప్రత్యేకించి ఇంగ్లీషును నేర్చుకొనవచ్చును.

రెండవ పంచవర్ష ప్రణాళికలో వయోజన విద్యకై చాలాధనం వెచ్చించబడగలదు. 1960 నాటికి 14 సంవత్సరాలు వయస్సుగల వారందరికి ఉచితంగా విద్యాబోధన జరగాలి. ప్రాదేశిక భాషలు హైస్కూలు వరకు మాధ్యమంగా ఉండనేఉన్నవి. కొంతమంది వేళ్ళ మీద లెక్కించవలసినవారు చేసే హఠంవలన విశ్వవిద్యాలయాలలో ఇంగ్లీషుకు ప్రాముఖ్యము తగ్గడంలేదు. విశ్వవిద్యాలయాలలో ప్రాదేశిక భాషలూ, హిందీ, బోధనాభాషలుగా ఏర్పడక తప్పదు.

ప్రజాస్వామ్య విధానంలోనూ, నియంతృత్వ విధానంలోనూ ఉన్న మార్పును ప్రజలు గుర్తిస్తూనే ఉన్నారు. మొన్నమొన్నటివరకు ప్రభుత్వాధినేతల భాషలలో వ్యవహారాలు జరిగినవి. ఇక ఆభాషలు వ్యాప్తిలో ఉండనేరవు. ప్రజాస్వామ్య విధానంలో ప్రజల భాషలకు ప్రాముఖ్యము ఏర్పడితీరాలి. ప్రస్తుతం గుమాస్తాగిరిని సంపాదించడానికి ఎక్కువమంది కళాశాలల్లో విద్యాభ్యాసం చేస్తున్నారు. ఇక ముందు

ముందు రాజ్య వ్యవహార భాషనుబట్టి విశ్వవిద్యాలయాల భాషకూడ మారకతప్పదు. ప్రస్తుతం మన దేశంలో ఉన్న విశ్వవిద్యాలయాలు ప్రజల భాషలను మాధ్యమంగా అంగీకరించి తీరుతవి. ప్రాదేశిక భాషలు,' సార్వదేశిక భాష హిందీ అభివృద్ధిలోనికి వచ్చితీరుతవి. అట్టి స్థితిలో ఇంగ్లీషుకు ఇప్పుడున్న సామ్రాజ్యం ఇంకా ఉంటుందా ? అది సంభవమా? ప్రస్తుతమున్న స్థానంలోనుంచి ఇంగ్లీషును తొలగించక పోతే ప్రాంతీయ భాషలకు, సార్వదేశిక భాషకు తగిన స్థానంలభించదు.

*

# ఆంధ్రకవిత - పురాణయుగము

## నన్నయ - తిక్కనలు

కీ. శే. వేటూరి
ప్రభాకరశాస్త్రి

పురాణముల రచనము, ఆ రచనముల చెల్లుబడి ప్రబలముగా సాగిన కాలఖండమును పురాణయుగ మని వర్తమానులు వ్యవహరించుచున్నారు. అటువంటి కాలఖండములను యుగము లనుటకంటె శకము లనుట వ్యవహారార్థానుగుణ మనుకొందును. ఇట్లు మార్చిన పురాణశకము, ప్రబంధశకము అని కాని, మఱొక విధమున కవులనుబట్టి పేర్కొన్న నన్నయ శకము, తిక్కన శకము అని కాని అనుట యవును. అందఱును ఇప్పుడు "యుగ" మనియే వ్యవహరించుచున్నారు గాన నేనును అలాగే అనుచున్నాను. ఆంధ్ర పురాణరచన సంస్కృత పురాణరచనాను సారిగా సాగినది గాన ఆంధ్ర రచనాపద్ధతిని వివరించుటకు ముందు సంస్కృత సంప్రదాయానుస్మరణము కొంత ఆవశ్యకమే అవును. సంస్కృత పురాణములు తద్రచనా కాలము నాటి విద్వద్విజ్ఞానమునకు సర్వస్వములు. వేదములలో సర్వవిద్యలును అంకురప్రాయములుగా ఉండగా పురాణములలో అవి కొంతకొంత విరివిగా వెలసె ననవచ్చును. "సర్గ శ్చ ప్రతిసర్గ శ్చ వంశో మన్వంతరాణి చ, వంశానుచరితం చేతి పురాణం పంచ లక్షణమ్" అని సృష్టి విధము, ప్రళయముల తీరు, రాజ వంశముల చరిత్రలు, మన్వంతరకథలు, మహర్షుల చరిత్రలు మొదలగు వానితో పురాణము లుండునని లక్షణము ఉన్నను పురాణములలో ఇంకను ఎన్నో దేశచరిత్రలు, వైద్యము, జ్యోతిషము, నీతి, ధర్మ-కామశాస్త్ర ములు, వ్యాకరణాలంకార సాహిత్యాది శాస్త్ర సంప్రదాయములు మొద లయినవి కొంతకొంత సంగ్రహముగాను, కొన్నిచోట్ల విరివిగాను కూడ

వర్ణితములై ఉన్నవి. అగ్ని పురాణములో వ్యాకరణము, వైద్యము, జ్యోతిషము మొదలయిన వెన్నియో ఉన్నవి.

ఇట్టి పురాణములు సంస్కృత భాషా మాత్ర పరిజ్ఞానము గల జన సామాన్యమునకు కూడ అర్థము కాదగినట్లు సులభ భాషలో, ప్రాయిక ముగా సులభమైన అనుష్టుప్ఛందస్సులో తేలిక వాక్యాన్వయములతో తేటగా ఉండును. వ్యాసులవారి రచనలలో తఱచుగా 'చ, వై, తు, హి' అని పాదపూరణపు పొల్లుపదము లున్నవి _ అనికూడ పండిత పరిహాస మున్నది. పురాణ సామాన్య రచన ఇట్లు ఉండుననుట సంగతమే కాని, కొన్నిపట్లు పురాణములలోనివే, సంప్రదాయ పరిజ్ఞానము లేనిచో ప్రౌఢ పండితులకు కూడ కొఱకరాని కొయ్యలు, ఉక్కు సెనగలు అనదగినవిగా ఉన్నవి. పురాణములలోని కెల్ల భారత భాగవతములు రామాయణము ప్రధాన మయినవి. రామాయణ భారతములు కావ్యేతిహాసము లనబడినను, పురాణములని కూడ సామాన్య వ్యవహార మున్నది. తెలుగున అవి పురాణములే అనుచున్నాము. ఉక్కు సెనగలు పై మూడు గ్రంథముల లోను, అందులో మఱీ భారతమున ఉన్నవి. భారతములోని ఉక్కు సెనగలకు వ్యాస ఘట్టము లని పేరు. మచ్చు చూపుచున్నాను.

"పశ్యః పశ్యతి పశ్యన్త మపశ్యన్తంచ పశ్యతి.
అపశ్యస్తావ (త్వాద ?) చక్షుష్ట్వాత్ పశ్యాపశ్యౌ న పశ్యతః
చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాం పంచభి రేవచ,
హూయతేచ పునర్ద్వాభ్యాం స మే విష్ణుః ప్రసీదతు"

ఈ విధముగా పురాణములు వివిధ విషయములతో, వివిధ రచన లతో అరణ్యముల వంటివై ఉండును. అర్వాచీనములయిన కావ్య నాటక ప్రబంధాది రచనలు పురాణారణ్యముల నుంచి ఉద్ధరించి సేకరించి తీర్చిదిద్ది నాటిన యుద్యానములవంటి వనదగును. పురాణములలో కావ్య నాటక ప్రబంధాది రచనల పొలుపులు సుకుమార దృశ్యములై ఉండును గాని, కావ్య నాటకాదులలో పురాణ రచనములలోని శాస్త్రాంశ ధీకర

దృశ్యము లుండవు. ఇటువంటి సంస్కృత పురాణఫక్కి ననుసరించి తెలుగు పురాణ రచన వెలసినది. నన్నయ మొదలుకొని శ్రీనాథుని దాఁకఁ గల యాంధ్ర గ్రంథ రచన పురాణయుగ రచన యనఁదగినది. ఆ కాలమున ప్రాయికముగా ఆంధ్రమున పురాణ రచనలే వెలసినవి. కవిత్రయము, మారన, పాల్కురికి సోమనాథుడు, భాస్కరాదులు, నాచన సోమన, శ్రీనాథుడు, పోతన, సింగన పురాణ కవులలో ప్రధానులు. పురాణ కవి రచనలను గూర్చి ప్రసంగించునప్పు డీ యందఱ విషయమును రావలసినదే. అయినను ముందు ముఖ్యులయిన భారత కవిత్రయము వారినిగూర్చి మాత్రమే యిప్పటి నా ప్రశంస.

కవిత్రయమువారు దైవభక్తులు. సదాచారులు. ఉత్తమ పండితులు. కవితా తపస్సు చేసి వారు కాంక్షితార్థములను అంతర్వాణీ యుద్బోధములతో నందుకొని కావ్యరచన కావించినారు. తర్వాతి సర్వాంధ్ర కవి కుటుంబములకు వారి పవిత్రవాక్కులు నిక్షేపములయి దొరకిన బంగారు నక్కులు ఆ ముువ్వుర రచనములతో తెలుగున వెలసిన మహాగ్రంథము భారతము. దాని మూలగ్రంథము అయిదువేల యేండ్లనాటి భారతీయ చరిత్రాంశములు గల ప్రాతగ్రంథమే అయినను సర్వప్రపంచముననుు దాని పలుకుబడి చెల్లుబడి అగుచునే యున్నది.

వ్యాసకృతిని మహా భారతమును నన్నయ యిన్ని లక్షణములు గలదానినిగా వర్ణించినాడు,

“ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని
కవి వృషభులు మహా కావ్యమనియు
లాక్షణికులు సర్వ లక్ష్య సంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియు

పరమ పౌరాణికుల్ బహు పురాణ సముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ
వివిధ వేద తత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు."

ఇట్టి సంస్కృత భారతమును—

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కలితార్థయుక్తి, లో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప, నా
నా రుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగాన్."

నన్నయ పై తీరున సర్వశాస్త్రార్థ కలితముగానే కాక భారతమును ప్రసన్న రచనతో మహాకావ్యలక్ష్యముగా గూడ తెనిఁగించినట్లేర్పడును. కనుకనే యాతనికి వాగనుశాసన బిరుదము గల్గెను. సంస్కృతమున పురాణములు, కావ్యనాటకాదులు అన్నియు వెలసినపిదప ఉపక్రమించిన దగుటచేత తెలుగు పురాణరచన తనలోనే సంస్కృత సర్వకావ్యరచనా చమత్కారములను ఇముడ్చుకోవలెనను యత్నముతో సాగినది. ప్రాచీనుఁడు గణపతిదేవుఁడను కవి "ఆంధ్ర కావ్యపథము దీర్చిన నన్నయ భట్టు గొలుతు" నన్నాడు. నన్నయ భారతము చదివినచో అందులో భాషాకవితాలక్షణ పరిష్కారములను ప్రయత్నపూర్వకముగా నన్నయ లక్ష్యీకరించినట్లు కాననగును.

"పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు వాణస ధరామరవంశ విభూషణంబు నా
రాయణభట్టు వాఙ్మయ ధురంధరుఁ డీ కృతి కిష్టుడున్ సహా
ధ్యాయుఁడునైనవాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగాన్"

ఈ పద్యము ద్వితీయ తృతీయ చరణములందు 'నారాయణ' పదము "ర" యతి ఖండాఖండములుగా స్వరవ్యంజనములతో రెండు దెఱఁగుల నుంచుట లక్షణ విశేష నిరూపణార్థము గదా! ఇట్టివెన్నేని విశేషాంశములను నన్నయ రచనలో చూపవచ్చును.

శరత్సమయమున సరాళముగా సమప్రదేశమున ప్రవహించు తెలినీటి తేటవాకవలె నన్నయ రచన సుప్రసన్నమై, చాటుమాటులు లేనిదై, కరతలామలకముగా తనలోఁగల సర్వార్థములను ప్రవ్యక్తముగా గుర్తింపనిచ్చునదై, సుఖప్రవేశమై, సుస్వాదమై, నిర్వక్రగతితో నెగడుచుండును. వ్యాసభారత రచనలో 'చ, వై, తు, హు' లున్నట్లు అక్కడక్కడ నన్నయ రచనలో 'మానుగ, పాయక, పర్వగ, ఇమ్ముల' మొదలగు పాదపూరణపు పొల్లుపదములుండును. గ్రంథ గ్రంథులు నన్నయ రచనలో నుండవు. నన్నయ శయ్యవంటి పురాణశయ్య— కావ్య గౌరవము గలది— భాగవతకర్త కొక్కనికే తక్క మఱి యితర పురాణయుగాంధ్రకవుల కెవ్వరికిఁ దక్కలేదు. నన్నయ పురాణశయ్యా సౌభాగ్యమునకు లక్ష్యము నొక్క గీతపద్యమున గుర్తింపవచ్చును.

"ఎల్లవారు నెఱుఁగ నొల్లని ధర్మవు
బేల నీకుఁ దెలుప నేల వలసె?
చిఱుతవాని కింత దఱుసంటి పలుకులు
నన్నె వృద్ధజనము లున్నచోట?"

రాజసూయ మహాధ్వరము జరుగునపుడు భీష్ముఁడు ధర్మరాజుతో 'నఖిలలోక పూజ్యు నచ్యుతుఁబూజింపు' మనగా శిశుపాలుఁ డుపాలంభన పరుండయి యధోక్షజు నాక్షేపించుచు ధర్మరాజున కిట్లనుచున్నాఁడు.

"అవనీనాథు లనేకులుండఁగ విశిష్టాచార్యు లార్యుల్ మహీ
దివిజుల్ పూజ్యులు పల్వురుండఁగ ధరిత్రీనాథ! గాంగేయ దు
ర్వ్యవసాయంబునఁ గృష్ణుఁ గష్టచరితున్ వార్ష్ణేయుఁ బూజించి నీ
యవివేకం బెఱిఁగించి తిందఱకు దాశార్హుండు పూజార్హుఁడే?"

ఈ పద్యమున ననుప్రాసము, నక్షరసౌభాగ్యము, శయ్యా యొయ్యారమును మాత్రమే కాక దాశార్హుఁడు అనగా పల్లెలు, బోయలు, మొదలగు వారికిఁ దగినవాఁడు, వారిలో విహరింపదగినవాఁడు లేక భృత్యతకు, నౌకరీకి తగినవాఁడు శ్రీకృష్ణుఁడు పూజార్హుఁడగునా యనియు నాక్షేపము. దాశార్హ పదమునకు రెండర్థము లున్నవి. పల్లెకారీలకుఁ దగినవాడనియు, నౌకరీకిఁ దగినవాఁడనియుఁ జెడ్డ యర్థము. దశార్ణదేశభవుఁడని మంచి యర్థము.

"ఇతనికిఁ గూర్తురేని ధనమిత్తు రభీష్టములైన కార్యముల్
మతినొనరింతు రిష్టుఁడని ఘంతురుగాక మహాత్ములైన భూ
పతులయు విప్రముఖ్యుల సభన్ విధిదృష్ట విశిష్టపూజ నా
యతికి ననర్హు నర్హుఁడని యచ్యుతు నర్చితుఁ జేయఁ బాడియే ?"

ఇక్కడ ధర్మరాజుతో భీష్ముడు అచ్యుతుఁ బూజింపు మనునప్పుడుపయోగించిన యచ్యుత పదమునే శిశుపాలుఁడు వెక్కిరింపుగా నర్థాంతరమునఁ బునఃప్రయోగముచేసినట్లు నన్నయభట్టు రచించి గంభీరభావము గల్పించినాఁడు. అతఁడు విధిదృష్ట విశిష్ట పూజనాయతికి ననర్హుఁడు ఇట్టి యా యచ్యుతుని నర్చితునిఁజేయుట పాడిగాదు— అని శిశుపాలుని భావము. భీష్ముని పలుకులలోని యచ్యుత పదమునకు అచ్యుతుడు అని యర్థాంతరము గలుగుట ప్రాచీన వ్యాకరణ సంప్రదాయ సమ్మతము. ఈ పద్యమునఁగూడ నక్షర రమ్యత, యనుప్రాస చమత్కృతి దైవాటి యున్నవి. ఈ శిశుపాల కథా ఘట్టమెల్ల శబ్దార్థ గాంభీర్యకలితమై రసోత్తరమై యున్నది.

"అవమాన్యున్ సభలోన మాన్యుఁడని సౌహార్దంబునం గౌరవ
స్థవిరప్రేరణ నిన్నుఁ బాండు తనయుల్ తప్పంగఁ బూజించి, ర
య్యవివేకాస్పదులైన పాండవులు మోహాంధుండు భీష్ముండుఁ గే
శవ ! నీవుం గడఁగుండు నాకు నెదురై సంగ్రామ రంగంబునన్."

ఇందు నాల్గవ చరణంబున 'కే' యని కేక, 'శవ నీవుంగడఁ గుండు' అని నింద. ఇట్టిచోట్లనెల్లఁ బలుకుబడిలోనే యర్థవిశేషములు పదచ్ఛేద భేదముచేఁ గల్పించి గంభీర భావభేదములకు ఝుడితిస్ఫూర్తిఁ గూర్చుట నన్నయ నైపుణ్యము. కారకాన్వయకౌటిల్యముతో నర్థవిశేష ములను సాధించుట నన్నయతీరుకాదు.

భారత కథోపాఖ్యానాదులలోని పాత్రముల భావములు, సంభాషణ ములు చాల ప్రాఁతకాలపువి గావునఁ గొన్నిచోట్ల వ్యంగ్య వక్రోక్త్యాది కవితా కౌటిల్యములు లేనివిగా నమాయికములుగా నున్నవి. అట్టివానిని తెలిగించుటలో నన్నయ తిక్కనలు విభిన్నరీతుల నాశ్రయించిరి. నన్నయ తన నాఁటికే వెల్లివిరిసియున్నవయినను కావ్యాలంకార శాస్త్ర సంప్ర దాయముల నంతగాఁ జొప్పింపక మూలగ్రంథ ముగ్ధతా మాధుర్యములఁ గాపాడినాఁడు. తిక్కన యాయా పాత్రములఁ దననాటివానినిగాఁ గొన్ని చోట్లఁ గావ్యౌచితీ నిర్వహణార్థమై మార్చుకొని తననాటి కావ్యాలంకార శాస్త్ర సంప్రదాయముల కనుగుణముగాఁ గథా నిర్వహణము గావించి నాడు. నన్నయ రచన మూలానుసారియయి, మౌగ్ధ్య మాధుర్య మనో జ్ఞమై, యార్షమై యున్నదనుట కొకటి రెం డుదాహరణములు.

నన్నయ శకుంతలోపాఖ్యాన రచన కావ్యాలంకారౌచితీ రీతినిఁ జూడఁగా గ్రామ్యతా దోషజుష్ట మనఁదగియుండును. వ్యాసుఁడే దాని నట్లు రచియించినాఁడు. అమాయకములైన సత్యకాలపు మునిపల్లెల పిల్లల ముగ్ధమధుర సంభాషణములను మూలానుసారముగా తెలిఁగించుటే లగ్గని నన్నయ భావించి యట్లు రచించియుండును. తిక్కన యగుచో నాపట్టుల వ్యంగ్య వక్రోక్తి కల్పనాశిల్పముల నెట్టుకొల్పి నవ్యకాలిక రీతిని కావ్యశయ్యతోఁ గల్పించియుండెడివాఁడేమో! నాటకరూపమున నాకథ నట్లే కాళిదాసు మార్చివేసినాడుగదా!

"ఏను కచుండనువాఁడ, మహానీమసమన్వితుఁడ, బృహస్పతి సుతుఁడన్" అని చెప్పుకొని శుక్రుని శుశ్రూషించిన కచుని శుక్రపుత్రి యైన దేవయాని ప్రేమించి యిట్లు కోరినది.

"నీవును బ్రహ్మచారివి పవీతుఁడ వేనును గన్యకన్ మహీ
దేవ కులావతంస! రవితేజ! వివాహము మీకు నాకు మున్
భావజశక్తినైన యది పన్నుగ నన్నుఁ బరిగ్రహింపు సం
జీవని తోడ శుక్రు దయఁజేయుము నాకుఁ బ్రియంబు నావుడున్"

అని కోరి కచునిచే నిరాకృతయైన దేవయాని దైవకృతముగాఁ బిదప యయాతి మహారాజు పాణిగ్రహణము గావింపఁగా నన్నతీరు మౌగ్ధ్యమాధుర్యభాసురమే గాని నవ్య కావ్యౌచితీరీతిని రోతఁగొల్పునదే. ఇట్టి సందర్భముననే అనఁగా మాయావటుఁడు పార్వతిని భార్యవుగమ్మని కోరు సందర్భమున శృంగార రస భావశ్లేష చమత్కార గర్భితముగా—

"కి యచ్చిరం శ్రామ్యసి గౌరి, విద్యతే
మమాపి పూర్వాశ్రమ సంచితం తపః
తదర్ధభాగేన లభస్వ కాంక్షితం
వరం త మిచ్ఛామి చ సాధు వేదితుమ్"

అని కాళిదాసు రచన గావించినాడు. శ్రీనాథుఁడు దానిని దెలిఁగించుటలో కాళిదాసు మార్గమును పీడనాడి అలంకార శాస్త్ర సంప్రదాయ వాసనల నెఱుఁగని వారినిగానే పార్వతీ వటులను భావించి నన్నయ చ్ఛాయనే యనుగమించినాఁడు.

"ఏనును బ్రహ్మచారిఁ దరళేక్షణ నీవును గన్య వెంత కా
లానకు నీకుఁ బెండ్లియె ఫలంబగునేని విచారమేల స
మ్మానముతోడ నన్ను మునిమాన్య వివాహము గమ్ము లెమ్ము, కా
దేని తపంబులోని సగమిచ్చెద మాను తపోభిమానమున్"

నన్నయ భారతభాష నాగమసూత్రస్మృతి భాషనుగా భావించుచోఁ దిక్కన భాషను గాళిదాస కావ్య భాషనుగాఁ బరిగణింపవచ్చును. నన్నయ దొక ఋషిమార్గము. తిక్కన దొక రసమార్గము.

"విలువిద్య నొరులు నీ క
గ్గలముగ లేకుండ నిన్నుఁ గఱపుదునని మున్

బలికితిరి నాకకా దీ
త్రిలోకముల కధికుఁ జూచితిమి యొక యెఱుకన్.

ఈపద్యమున నాల్గవచరణము తొల్త జగణపుటుయ్యాలయూపులో తర్వాతి కవు లనేకులు హాయిగా ఊగసాగినారు. ఈ యూపులో పింగళి సూరన్న యెట్లూగినాఁడో గుర్తింపుఁడు.

"అపు డించుక తడ వన్యో
న్య పాణి సంస్పర్శ సంభృతానంద స్తం
భ పరీతాత్మత నుండిరి,
ప్రపంచమంతయును మఱచి పతియున్ సతియున్"

శ్రీనాథ పెద్దనాది కవీశ్వరులు చంపకోత్పలాది పద్యములలో మూడు నాల్గు చరణముల నొక సంస్కృత సమాసపు జాడింపున జాడించి, హాయి హాయి యనిపింతురు ఈ హృద్య పద్య విద్యకు నన్నయ ఆద్య గురువు.

"అలయక ధర్మశాస్త్రముల యందుఁ బురాణములందుఁ జెప్ప ను
త్పలదళనేత్ర వింధుము యపత్యము మేలని కావునన్ యశో
నిలయులఁ బుత్రులం బడయు నీ కొనరించెద సంగతాంగుళీ
దళ విలసన్మదీయ కరతామరసద్వయ యోజితాంజలిన్"

"అనుపమ కార్ముకాది వివిధాయుధ విద్యలయందు గోవిదుం
డనగ నజయ్యుడై పరగు నర్జునుఁ బోలగ నన్ను వెందు లే
రను జనఘోష ముచ్చరితమయ్యె మరుచ్చలితోచ్చ వీచి ని
స్వన ముఖరాబ్ధి వేష్టిత విశాల మహీ వలయాంతరంబునన్"

"అతుల విభూతితో మణిమయాభరణద్యుతు లొప్పగా శత
క్రతుఁడు శచీసమేతుఁడయి కాంచన చారు విమాన మాలికా
గత దివిజోత్తముల్ గొలువఁగా గొలువుండు వరాప్సరోంగనా
యత విలసత్కటాక్ష కుసుమార్చిత సుందరవక్త్రచంద్రుడై"

రసము, భావము, రీతి అనునవి మూడును ముప్పిరిగొని జిగి బిగులతో ముచ్చట్లు గొల్పు పద్యములు ఇవి మూడును చూడుడు :

"ప్రకటిత కోప వేగమునఁ బద్మ దళాయత నేత్రముల్, భయా
నక తరలీలఁదాల్చె నరుణద్యుతి నుద్యతమై త్రిశాఖమై
భ్రుకుటి లలాట దేశమునఁ బొల్చెఁద్రికూట తట త్రిమార్గ గా
సుకృతిఁ బ్రభంజన ప్రియ తనూజున కంతకమూర్తి కచ్చటన్"

"ధారుణి రాజ్య సంపద మదంబునఁ గోమలిఁ గృష్ణఁజూచి, రం
భోరు నిజోరుదేశమున నుండఁగఁ బిల్చిన యిద్దురాత్ము, దు
ర్వార మదీయ బాహు పరివర్తిత చండ గదాభిఘాత భ
గ్నోరు తరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్"

"పిలువంగఁ బడక సభలకు
బలిమిం జని పలుకు పాపభాగుల లోకం
బులకుఁ జన వేడి పలికెదు
పలువా ! యెఱుఁగవు పరాత్మ పరిమాణంబుల్"

ఈ క్రింది పద్యపు కడపటి చరణములో విశేషణములు విశేష్యమునకు తర్వాత నుండి ఒకదాని కంటె నొకటిగా గుణోత్తరములై, అవిమృష్ట విధేయాంశ మనియు, పతత్ప్రకర్ష మనియు నెన్నికఁగన్న కావ్య దోషములకు వ్యతిరేకముగా కావ్య గుణోదాహరణతను గల్పించు చున్నవి.

"సుత జననోత్సవంబున విశుద్ధయశుండు యుధిష్ఠిరుండు, సం
భృత హృదయ ప్రమోదుఁడయి పెంపున నిచ్చె సువర్ణభూషణ
వ్రతతులు గోధనాయుతము బ్రాహ్మణ ముఖ్యులకున్ నిరంతర
వ్రతులకు వేదవేదులకు వారిజసంభవు నట్టివారికిన్."

ఈ విధముగా నన్నయ రచనలలో పలుపోకల గుణవిశేషములను పరిగణింపవచ్చును. ఆయన రచన రసధారల యూటపట్టు. ఆంధ్రకవుల కాతఁడు "మధుమలెదుఫణితీనాం మార్గదర్శీ మహర్షిః".

నన్నిచోడాది కవీశ్వరు లాయన రచనల నెన్నిఁటినో పుడికి పుచ్చుకొన్నారు. నన్నయ నన్నిచోడుల పద్యము లివి రెండు చదువుఁడు.

"తడబడ బడియెడు రవమును
బడికాలెడు రవము గాలి పలుదెఱగుల ప్ర
స్పెడు రవమును దిగ్వలయము
గడుకొని మ్రోయించె నురగకాయోత్థితమై."

"గిరిసుతమై కామాగ్నియు
హరుమై రోషాగ్నియుం దదంగజుమై, ను
ద్ధుర కాలాగ్నియు రతిమై
నురుశోకాగ్నియును దగిలి నొక్కట నెగసెన్"

తిక్కన, శ్రీనాథుడు, పోతన, పెద్దన, మొదలగు మహాకవులు నన్నయ రచనములలోని పల్కుపొలుపులను పెక్కింటిని బరిగ్రహించినారు. నన్నయ రచన ధర్మోదాత్తము. కర్ణాటకములోని జైనభారత పుటల బడి తెలిసినవాఁడు గనుక తెలుఁగునాటిలో వ్యాసభారత ధర్మవిశేషము లను వెలయింపఁగోరి అతఁడు కావ్యరచనకుఁ గడఁగినాఁడు.

భారతము నీతిశాస్త్రగ్రంథమని ప్రఖ్యాతిఁ గన్నది. నన్నయ భారత భాగములోని నీతిపద్యములు రీతి హృద్యములు, సౌలభ్య సుందరములు. తెలుగు కవులందరిలో వచన రచన నన్నయ చేసినట్లు మరి యే కవియు చేయలేకపోయినాఁడు. ఆ వచన రచనలో పలుకుబడి బహు మనో హరము. వాక్యములు సులభమయినవి. అనుప్రాసపు దట్టింపు లందుం డవు. వచనఖండముల పరిమాణము మితమై పులకండములఁ బోలి యుండును. ప్రపంచ భాషలలో ఆంధ్రభాషకు, ప్రపంచ కవితలలో

ఆంధ్ర కవితకు ఏదేని అర్హస్థానము అబ్బఁదగిన యోగ్యత గలదేని ఆ యోగ్యతావిస్తర భారమెల్ల నన్నయ భారతభాగమే మోయవలసిన దగును. ఆ పుణ్యమూర్తికి వందనము ఆయన కాశ్రయమిచ్చి పోషించిన చాళుక్య రాజరాజు కీర్తి పతాక చిరస్థాయి!

"మదమాతంగతురంగ ముఖ్యపద సంపన్నుండు నన్నయ్య తొ
మ్మిది నూఱేండ్లకు ముందుఁజూపె కవితోన్మేషంబు సర్వాంధ్ర సం
పద పెంపొంద చళుక్య వల్లభుఁడు సామ్రాజ్యాభిషిక్తుండుగా
నది నాబోటికి నేటి కబ్బునటె వ్యాఖ్యానింప నాఖ్యానమున్."

నన్నయ్య తర్వాత భారత రచనమును బూరించిన తిక్కన సోమయాజి నన్నయ రచనమును దిన్నగా నెఱిఁగినవాఁడే అయినను, నన్నయ శయ్యాసౌభాగ్యమును, ప్రసన్నతను పాటింపక, సంస్కృత భారతపు వ్యాసఘట్టములను బోలిన గ్రంథగ్రంథుల నధికముగాఁగూర్చి కవితా మర్మముల నధికముగాఁ జొప్పించి పురాణ రచనాసౌలభ్యమును గోల్పడినాఁడు. వర్షాసమయమున నొడుదుడుకు నేలలనుండి సుడులు దిరుగుచు, మడుగులు మాటులు గలిగి లోతు తెలియనీయని కలక నీటి పోటుతో ప్రతిపదమును జాగ్రత్తవహించినఁగాని దాఁట వీలుగొల్పని వక్రగతులతో సాగు గంభీర నదీప్రవాహము వలె తిక్కన రచన మప్రసన్నమై వెనుకకు ముందుకుఁ దిరుగు వాక్యోపవాక్యములయు కారకాన్వయములయు కౌటిల్యముతో, ఇంక నిందేమి విశేషము గలదో యని సహృదయులు ప్రతిపదము సందేహముతో ఆచి యాచి చూచిచూచి మఱీ చదువవలసిన తీరున చిక్కులుగొల్పుచు జిగిబిగితో నుండును. ఇది పురాణపక్కి కాదు. మఱి దివ్యకావ్య ఫక్కి. కవితామర్మ మిందెక్కువ. వక్రోక్తులు, అర్థాలంకారములు, వ్యంగ్యము నిం దధికముగా నుండును. ఇందుకు లక్ష్యముగా నొక్క గీతపద్యము నుదాహరించుచున్నాను. విరాటపర్వ ద్వితీయాశ్వాసమున కీచకుఁడు ద్రౌపదిపై తమక మాపుకొనలేక నీచవాంఛను వావిడిచి వెల్లడించినాఁడు. అప్పుడటోపేటి

కలుషించియు దుర్వారంబైన పరిభవ వికారంబుఁ దోపనీయక వెరవు తోడన తప్పించుకొనవలయునని యిట్లన్నది.

> "చనునె యిమ్మాటలాడు సజ్జనుల కాఁడుఁ
> బుట్టువులతోడ నీవును బుట్టినాఁడ
> వట్లుఁగాకయు హీన వంశాభిజాత
> నైన పతిపత్నినగు నన్ను నడుఁగదగునె?"

"అన్నా! కీచకా! సత్పురుషులు పరస్త్రీలనిట్లు కోరవచ్చునా? అంతేకాక ఆడుతోడు గలవాఁడు మఱీ జాగ్రత్తగా నుండవలెనుగదా! నీవు సజ్జనుఁడవు సుదేష్ణవంటి యాడుతోడు గలవాఁడవు. నీవిట్టి చెట్టపలుకులు పలుకరాదే! ఇట్లు కోరగూడమికి నీ యోగ్యతాంశము లివి రెండేగాదు. మఱి నా యయోగ్యతాంశములును రెండున్నవి. నేను హీనవంశజాతను, మగనాలను. ఉన్నత వంశము గర్హించుననియు ఆడుతోడు చెడనాడుననియు, అక్కడకూడ నీగతి పట్టవచ్చుననియు నీ విషయమున నీవు వెఱవవలెను" అని సామాన్యముగా తోచు బాహ్యార్థము ఇక్కడ లోతయిన అర్థాంతరము నున్నది, "సజ్జనుఁడు, ఆడుతోడుగలవాడు ఇట్టి మాటలాడడు. ఇట్టి చెట్టలాడుచున్నావుగాన నీవట్లుగాక దుర్జనుఁడవు, ఆడుతోడు లేనివాడవు నయితివి, 'నాకు సజ్జనతాపేక్షలేదు. ఆడుతోడు కలిమి నేను పాటించువాడనుగాను' అందువేమో। (సుదేష్ణ వీనికి తగిన యాడుతోడే. తన పాడునడత కామెనుగూడ తోడుపఱచుకొన్నాడుగదా). అయితే నీవట్లగుదువుగాక! హీన! ఓరి నీచుడా! వంశాభిజాతను, పవిత్ర క్షత్రియ వంశజాతను, యజ్ఞాగ్ని సంభూతను అయిన పతిపత్నిని. అఖండ పరాక్రములైన భర్తలు గలదానను, నన్ను నటరా నీవు కోరునది. నా వంశపుయోగ్యతను భర్తల యోగ్యతను దెలియక వదరుచున్నావు. ఈరెండు యోగ్యతలు నిన్ను నాశపఱుపగలవురా" అని యర్థాంతరము.

పాఠకులు పైరెండర్థములలో కీచకసైరంధ్రీ పాత్రములను జూచి సాధారణముగా తొలి సువ్యక్తార్థమును సైరంధ్రిలో దాగియున్న ద్రౌపదీ పాత్రమును గుర్తించి లోతుగా రెండవ యంతరార్థమును గ్రహింపగల్గుదురు. లోతుగా యోచింపజాలనివారు తొలి యర్థమునే గ్రహింతురు. కీచకుడు మదన పిశాచగ్రస్తుడై యాత్రపాటుతో నున్నాడు గాన తొలియర్థమునే గ్రహింపగల్గెను ద్రౌపది తాను భావించునది రెండవ గంభీరార్థమునే. తిక్కన యీ రెండర్థముల ననుగతపఱిచి శ్లేషధ్వన్యర్థ చమత్కారముతో పద్యమును గూర్చినాడు. పయి పద్యమును 'అయిన పతిపత్ని' ననుచోటను 'అడుగ దగునె' అనుచోటను అర్థవిశేషములున్నవి. (అయిన యింటివారు ఇత్యాదులు చూచునది.) అయిన అనగా చెల్లివచ్చిన, ప్రఖ్యాతిగాంచిన భర్తలు గలదాననని (అటువంటివారి విషయమయి అడిగేదేమిటి - ఇత్యాదులు చూచునది). ప్రశ్న స్మరణమే చేయరానిదాననని అర్థవిశేషములు. ముద్రణములం దీ పద్య మిట్లున్నదిగాని యిందు తిక్కన కూర్పు కొంత మార్పుచెందియుండు ననుకొనుచున్నాను. 'అట్లుఁగాకయు' అనుచోట అట్లు తర్వాతి సముచ్చయపుటరసున్న— 'కాకయు' అనుచోటి 'యు' స్వారస్యమును సంపాదింపఁగల్గియే యున్నది. ఇఁక 'యు' వ్యర్థము ' తిక్కన "అట్లుఁగాకయో హీన" అని రచన చేసియుండును. తొలియర్థమున "అట్లుఁగాక - అయో - హీన వంశాభిజాతను అనియు, రెండవ యర్థమున అట్లుఁగాక - ఓహీన" అనియు భేదము సనిపడును.

"అని పీడఁగఁ బల్కిన న
మ్మనుజాధముఁ డంతఁబోక మదనోన్మాదం
బునఁ దన్ను నెదిరి నెఱుఁగక
వనితకు నిట్లనియెఁ గొరవంపుఁ బలుకులన్"

తర్వాతి యీ పద్యములోఁ దన్ను నెదిరిని - పాదప్రహారము చేయుదానిని ద్రౌపదిని అనియు కవి పొసగించినాఁడు. ఇట్లు తిక్కన

భారత పురాణ రచనమున ప్రబంధ ఫక్కితో, వక్రోక్తి చమత్కృతులు, శ్లేషభంగులు, అనన్వయాభాసములు, గడుసు పొసగింపు కూర్పు తీర్పులు లెక్కకు మిక్కిలియయి యున్నవి. అత్యంత శ్రద్ధతో పరిశీలింపగా ఒక్క విరాటపర్వ ద్వితీయాశ్వాసముననే ఎన్నో శబ్దార్థ చమత్కారములు ప్రస్తుతపు ముద్రణములలో, వ్రాతలలో అపరిశీలితములుగా చెడిపోయినవి, చక్కబఱుప వలసినవి గానవచ్చినవి.

తిక్కన దేశి పలుకుల మెలపులతోఁ గవితా మర్మములతో సంస్కృతమున వ్యాసుడు చొప్పించినట్లు పెక్కుచోట్ల గ్రంథ గ్రంథులను చేర్చినాడు.

" గురుని మాట సరకుగొనమి దుశ్శీలత
పిట్టఁ బుడుక గోరుఁ బిసుకఁ ద్రుంపఁ
గరవ మరుగు టుదయ కాలాస్తమయ సమ
యముల భానుఁ జూచు టాయువడఁచు "

ఈ పద్యమునఁ గవితా మర్మమున్నది. క్రొత్త వారీ పద్యము నర్థమును గుర్తింపఁజాలరు వృద్ధ విద్వాంసుల మూలముననో సంస్కృత మూలము మూలముననో గుర్తింపవలసినది దీని యర్థము. "లోష్ట మర్దీ తృణచ్ఛేదీ నఖఖాదీ చ యో నరః" అను మూలమున కిది తెనుఁగు. పిట్ట, పుడుక, గోరు అనగా లోష్టము, తృణము, నఖము అను వానిని పిసుకుటకును, త్రుంపుటకును కఱచుటకును అలవాటుపడుట ఆయువును హరించునని యర్థము. తిక్కన దీనిని 'బెడ్డ చిదుప, పుడక విరువ, గోరు గరవ, మరుగుటుదయ' అని సులువుగా గూర్పవచ్చును. అయినను నిందు యథా సంఖ్యాలంకారము చేర్చి పిట్టపుడుకగోరు అనుచో పిట్టను పట్టుకొను గోరునట్టి యని యనన్వితార్థాభాస చిత్రమును గల్పించి పాఠకులను లోతు యోచనకుఁ బాల్పఱిచినాడు. మఱియు

" అనిన నలు గాలివాన గోవును నశేష
శబ్దముల మంత్రమును లోహజాతిఁ గాంచ

నమును మనుజుల విప్రుండు సమధికత్వ
భాజనములంద్రు వేద ప్రపంచ విదులు"

తెలుగు కూర్పు మఱుగు లెఱుగనివారైనచో ప్రౌఢ సంస్కృత పండితులు సయితము ఈ పద్యమున నలు దేమిటి, గాలివాన యేమిటి అనన్వితముగా నున్నవే యని యంగలార్తురు. తిక్కన యిక్కడ చతుష్పాత్తులని గాని నాలుగు కాళ్ల జంతువులని గాని సులువుగా ననలేడా? అనఁగలఁడు గాని నలుడు, గాలి వాన అన్న ప్రసిద్ధ పదముల ఝటితి స్ఫూర్తి గలిగి పాఠకుల కనన్వయము తోచి లోతైన యోచనతో తదాభాస చిత్రము గోచరించునట్లు కవితామర్మ మిక్కడ కల్పించినాడు.

"సీతలపేనుగంటి నొక నేర్పున శౌరికి లంచమిచ్చి సం
ప్రీతుని జేసి కార్యగతి భేదము సేయగజూచె దింత బే
లైతిగదే సుమేరు సదృశార్థము జూచియుఁ బార్థుఁ బాయునే
యాతడు క్రీడిభక్తియును నచ్యుతుపెంపును నీవెఱుంగవే?"

శ్రీకృష్ణుడు రాయబారము వచ్చినపుడు విదురుడు ధృతరాష్ట్రునితో సంభాషించు సందర్భములోని పద్యమిది. ఇచ్చట సీతలపును నే నెఱుగుదును. అను ముఖ్యార్థమేకాక అది సీతలలోని పేనువంటిదిసుమా! అను నర్థాంతరము కూడ నున్నది ఇక్కడ తిక్కన యెఱిగియే తలపేను శబ్ద చిత్రమును గూర్చినాడు. ఇటువంటి శబ్దార్థ చిత్రములను దిక్కన్న రచనమున నెన్నింటినేని లెక్కింపవచ్చును. అమధ్య నెల్లూరు తిక్కన వర్ధంతిసభలో తిక్కనరచనా విశేషములను గూర్చి చర్చ జరిగినట్లు పత్రికలలో జదివితిని. విరాట ద్వితీయాశ్వాసమున సైరంధ్రిని గూర్చి కీచకుని ప్రలాపములలో తిక్కన యశ్లీలార్థ దూషితముగా 'దీనిఁ బొందఁగాంచు తెఱఁగు నాకెయ్యది యొక్కో' అని కూర్చెననియు, నది కీచకపాత్రోచితమని యొకరును, 'దీనిఁబొంద' యనుచో నశ్లీలార్థము పరిగణింప నక్కరలేదని మఱికొందఱు ననిరట. ఇప్పుడు ప్రచారములో నున్న తిక్కన విరాటపర్వముద్రణము లాహేడింటిలో పారమిక్లే ముద్రి

తమై యుండుటచే నీ యనర్థము వచ్చినది. తిక్కన రచన మిట్లుండదు. ఈ పద్యముపై నాలుగు సీస చరణములందును దీని జన్మంబున, దీని వల్లభుఁడు, దీని నామాకృతి, దీని వసించుటయని సైరంధ్రీ వాచక సర్వ నామము షష్ఠీసమాసగతమై యుండఁగూర్చి గీతిలో మాత్రము దీనిఁబొంద అని వ్యస్తముగా, నపక్రమముగా, నశ్లీలస్ఫోరకముగాఁ దిక్కనకూర్పడు. కాన ఇక్కడఁగూడ "దీని పొందుగాంచు తెఱగు నాకెయ్యదియొక్కొ" అనియే యుండవలెను. విరాటపర్వ ముద్రాపకులెల్లరును "దీనిఁబొంద" యనియే గ్రహించుట యనుశోచనీయము. తిక్కన "బొందను" ప్రయోగింపలేదు. లేఖకులు, ముద్రాపకులు, ప్రమాదపు బొందఁబడిరి. విరాటపర్వ ద్వితీయాశ్వాసముననే తిక్కన కవితామర్మములును, పద లాలిత్యములును, గడుసరి కూర్పు నేర్పులును నెన్నొ యప్రౌఢులైన లేఖక పాఠక ముద్రాపకుల మూలమున తార్మారై కానవచ్చినవి. దేశి తెలుగు మఱుగు లెఱింగిన ప్రౌఢాంధ్ర పండితులుగాని గుర్తింపరాని వగుటచే ననేక పాఠములు తిక్కన రచనలో నట్లు తార్మారైనవి

"తన్వంగి మవ్వంపుఁ దనులత నెసఁగెడు
 నునుగాంతి వెల్లువ మునుఁగఁ బాఱఁ
గిసలయ హస్త కెంగేల నేపారు క్రొ
 మ్మించను లే యెండ మిగులఁ బర్వఁ
గమలాస్య ముద్దుమొగంబు లే మెఱుఁగుల
 మొత్తంబు పరి చుట్టు ముట్టికొనఁగ
ధవళాక్షి తొంగలి తఱచు ఱెప్పల చెన్ను
 కప్పను చీకటి గవియు దేర
బెగ్గలం బంతకంతకు నగ్గలించి
యొదవి చెమ్మట, చిత్తంబు సెదరి, యెందు
మెలఁగఁ దలఁపేది, యాసింహబలుఁ డనంగు
పట్టి యాడెడు జంత్రంబు పగిది నుండె."

ఈ పద్యము నెత్తుగీతి యందుఁగల యసమాపక క్రియల నాల్గింటిని సీసపు నాలుగు పాదములకు యథా సంఖ్యముగాఁ గూర్చుకొని యర్థ మెఱుఁగదగును. కాంతి వెల్లువ కీచకుఁడు మునుఁగునట్లు ప్రవహింపఁగా వానికి బెగ్గల మంతకంతకు నగ్గలమైనది. లేయెండ మిగులఁ బర్వఁగా వానికిఁ జెమ్మట యొదవినది. లేమెఱుఁగుల మొత్తమను సైన్యము చుట్టు ముట్టుకొనఁగాఁ జిత్తము సెదరినది. కనుఱెప్పల కప్పను చీఁకటి క్రమ్ముకొనఁగా నెందును మెలఁగలేక పోయినాఁడు. ఇందు, ఎత్తుగీతిపై యర్థమున కనుగుణముగా ముద్రణములందుఁ గానరాదు. మఱియు నింకొక పద్యము.

"సమద వారణము జంగమలత వెనుకొని
సరభసంబునఁ బట్టఁ జను విధమునఁ
గ్రూర దానవుడు భూచారి నిర్జరకాంతఁ
బొదువ రయమ్మునఁ బోవు భంగి
ఘోర గృధ్రము సుకుమార నాగాంగనఁ
బటుగతి నొడియంగఁ బాఱు కరణిఁ
బ్రబల బిడాలంబు బాలశారిక మీద
నడరి సత్వరమున నరుగుమాడ్కి
సింహబలు డత్యుదగ్రతఁ జిగురుఁబోఁడి
పజ్జఁగడువడిఁదగిలి కోపంబు గదుర
నొడిచి తలవట్టి తిగిచి మహోగ్రవృత్తిఁ
గొంకు కొసరించుకయు లేక కూలఁదాచె"

ఈ పద్యమున ద్రౌపది కుపమానములుగా మూఁడు చరణములలో జంగమలత, భూచారి, నిర్జరకాంత, సుకుమార నాగాంగన యనునవి భూలోక దుర్లభములున్నవి. నాల్గవ చరణమునఁ గూడ నట్లేకదా యుండవలెను. మఱియు మూడు చరణములలోను ద్రౌపద్యుపమాన పదములు ద్వితీయాంతములుగా నున్నవి. నాల్గవ చరణమునఁ గూడ

నట్లేకదా యుండవలెను. ఈతీరునఁ జూడఁగా "ప్రబల బిడాలంబు భారతీ శారిక నడఁప సత్వరమున నరుగుమాడ్కి" అని యుండుట బాగు. ఈ 'భారతీ శారిక' పదము భారతీదేవి ముంజేతి పలుకుఁజిలుక వంటిది.

కీచకుఁడు ద్రౌపదిఁ గూర్చి చేయు నసందర్భాలాపములలో నీ క్రిందిది యొకటి.

"చిత్తము మెచ్చి నావలనఁ జిక్కఁగ వెండియు నా లతాంగి, య
చ్చొత్తినయట్లు నాకుఁ దనయుల్లము తెల్లము సేయకున్కిఁ దా
నత్తఱి గ్రొత్త కాన్పగుట నడ్డమునొచ్చిన సిగ్గుపెంపు, న
న్నుత్తలమందఁ జేయుటకునో తలపోసి యెఱుంగనయ్యెడున్".

ముద్రణములో నీ పద్య మిట్లున్నది. తిక్కన పలుకుబడిగాని, యర్థపు సొంపుగాని యిందుఁ బొందుపడకున్నది ఇది యిట్లుండఁగాఁదగునని నా తలంపు.

"చిత్తము మెచ్చి నావలనఁ జిక్కఁగ వెండియు నాలతాంగి, య
చ్చొత్తిన యట్లు నాకుఁ దన యుల్లము తెల్లము సేయకున్కి, దా
నత్తఱిఁ గ్రొత్తకాన్పగుట నడ్డమునొచ్చిన సిగ్గుపెంపొ ? న
న్నుత్తలమందఁ జేయుటగునో ? తలపోసి యెఱుంగనయ్యెదన్".

రాయబార మరుగునప్పుడు కృష్ణునితో ద్రౌపది తన భంగపాటును జెప్పు పలుకులలో—

"అంతలు సేసి పోనడిచి యక్కట సంజయుచేతఁ జెప్పి పు
త్తెంతురె ? యిట్టి యూఱట మదింద్రియమందె యుధిష్ఠిరుండు, దా
నంతన యూళు లేవురకు నైదు సుయోధనుఁడిచ్చు నొక్కొ ? ఈ
కంత కృపావిహీనమతి నాతఁడు నేచుఁనె యన్నదమ్ములన్".

ఇందు 'ఈ కంత' అనుచోఁ గొందఱు వికటార్థములనుగూడఁ జెప్పుదురు. ఇక్కడ 'ఒక్కంత కృపావిహీన మతి నాతఁడు నేచునె యన్నదమ్ములన్' అన్న పాఠము సుందరము ఇంతవఱకు నే నిప్పుడు

వెల్లడించిన సంస్కరణములలో నిదియొక్కటి తక్కఁ దక్కినవెల్లను తిక్కన హృదయము నూహించి నేనే చేసినవికాని వ్రాతప్రతులఁ జూచి చేసినవికావు. ఈ తీరునఁ జూడఁగా దేశి తెలుఁగు మఱుఁగులలో సాటిలేని నేర్పుతో మెలఁగనేర్చిన తిక్కన సారస్వత భాండారమగు భారత భాగమును సరిగా నుపయోగించుకొనుటకు సమర్థమైన సహృదయ పండితగోష్ఠి జరగవలెను. ఇట్టి పరిశీలనము జరుగనిచోఁ దిక్కన పద ప్రయోగ లాలిత్యము సరిగాఁ బరిజ్ఞాతము కాఁజాలదు

తిక్కన రచనలో నింకొక వింతతీరు కూర్పును వివరించు చున్నాను. ఆంధ్ర కవితారచనమున వాక్యముల నసమాపకములుగా పద్యమునుండి పద్యమునకు సాగునట్లు కూర్చుట గలదు. అనఁగా నొక వాక్యము రెండు భిన్నపద్యములలో ననుగతమై యుండునన్నమాట. పద్యావసానమునకుఁ, బద్యోపక్రమమునకు నడుమఁ గొంత విశ్రాంతి యుండును. ఒక వాక్య ముచ్చరించునపుడుగూడ నడుమ విశ్రాంతి యుండఁదగును గనుక ఆకూర్పు అసందర్భముగాఁ దోఁపదు. కాని రెండు భిన్నజాతివియగు పద్యములలో నొక సమాసపదమునే సంధించి కూర్చుట చాల విడ్డూరముగా నుండును ద్విపదములు, రగడలు మొదలగు వానిలోను, మాలికావృత్తములలోను నాల్గుచరణములకుఁ బద్యము ముగి యదు కాన వానిలో నట్లుండవచ్చునుగాక, భిన్నజాతి పద్యముల యవసానారంభములలోనే ప్రధానముగా సంహిత పాటింపవలసిన సమాస పదము తిక్కన రచనలో నున్నది

"ఒకటి యడిగెదఁ గృపఁ జిగురొత్తఁ జెప్ప
వలయు మీరు మాయింటికి వచ్చి యొక్క
ప్రక్కక్రిందుగ నిరువది యొక్కదినము
లనఘ నిద్రించి తది మొదలైన నీదు—

"చరితం బద్భుతము మునీ
శ్వర! దీనికిఁ గారణము విచారమున కగో

చర మెఱిఁగింపు మనుదు నా
ధరణీవల్లభునితో నతండిట్లనియెన్."

'నీదు - చరితము' అన్న సమాసపదము రెండు భిన్నజాతి పద్యముల యంతాదులలో నున్నది. నన్నిచోడ మహాకవిగూడ నిట్లొకచోఁ బ్రయోగించినాఁడు.

" రవి పదాహతిఁ జెడియుండు రాజు వోలె
నని సరోజము లొందఁ జక్రాహ్వయములఁ
జెట్టలాడుట కని వికసిల్లుటకును
వెల్లనైనట్లు చుక్కలు వెలరువాఱె "

(కుమా. 8 ఆ.)

దిద్దవలెను. అర్థము కుదురక గ్రుడ్లు మిటకరించి కొట్టుకొనియెట్టకేల కిట్టు కవి పాఠము కనిపెట్టఁ గలిగినాను.

" రవి పదాహతిఁ జెడి యుడురాజు వోయె
నని సరోజము లొద్దఁ జక్రాహ్వయములు
చెట్టలాడుట, కవి వికసిల్లుటకును
వెల్లనైనట్లు చుక్కలు వెలరువాఱె "

ఉడురాజు=నక్షత్రాధిపతి, చంద్రుడు. ఉడిగిపోవు, ముగిసిపోవు రాజు అనికూడ; ఉడుఁబోత పిందె వంటిది. విరోధియైన యుడురాజు పడిపోవుట నాకసమున కెగసి చక్రవాక పక్షులు చూచి యా సంతోష వార్తను మిత్రములైన సరోజముల యొద్దకువచ్చి, చెట్టలాడుటకును= పడిపోయిన చంద్రుని నిందించుటకును, మఱియు నుత్సాహముతో ఱెక్క లల్లార్చుటకును అనియు, అవి మిత్రము లయిన యా సరోజములు వికసిల్లుటకును= వాని చెట్టలాట కుప్పొంగుటకును, వికాసము చెందుటకును, నవమానము చెంది తెల్లవోయినట్లు చంద్రుని మిత్రములైన నక్షత్రములు కాంతి హీనములై వెలవెలఁ బోయినవి.

★